బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో...

# ఆత్మజ్ఞానం ఎందుకు?

## తటవర్తి వీరరాఘవరావు



బ్రహ్మర్షి పత్రీజీ ఆశీస్సులతో...

# ఆత్మజ్ఞానం ఎందుకు?




రచన & ప్రచురణ : **తటవర్తి వీరరాఘవరావు**

ప్రథమ ముద్రణ : డిశంబరు, 2014

ప్రతులు : 3,000

ద్వితీయ ముద్రణ : జనవరి, 2021

ప్రతులు : 1,000

వెల : రూ. 70/-



పుస్తకముల కొరకు

**తటవర్తి వీర రాఘవరావు**

తటవర్తివారి వీధి, భీమవరం - 534 201. ప॥గో॥జిల్లా.

సెల్ : 9440309812, 9490171853

email : balajipyramid.bvrm@gmail.com

## విషయ సూచిక

# ఆత్మజ్ఞానం ఎందుకు?

బ్రహ్మర్షి పత్రీ గారు ఆంధ్ర రాష్ట్రమంతటా పర్యటిస్తూ... ఆంధ్ర రాష్ట్రమే కాదు అన్ని రాష్ట్రాలు, అన్ని దేశాలు పర్యటిస్తూ ఆత్మజ్ఞానాన్ని బోధిస్తున్నారు. ఈ ఆత్మజ్ఞానాన్ని పొందటానికి చేయవలసిన "శ్వాస మీద ధ్యాస" ధ్యాన సాధనను కూడా అందరికీ బోధిస్తున్నారు. అంతేకాదు ఈ ఆత్మజ్ఞానం పొందటానికి అవరోధమైన, జీవహింసకు కారణమైన మాంసాహారం మానమని అందరికీ బోధిస్తున్నారు. ఈ రకంగా ఎవరయితే హింసను వదలి అంటే మాంసం తినటం మాని, హంసను పట్టుకుంటారో అంటే 'ధ్యానం' చేస్తారో వారు తప్పకుండా ఈ 'ఆత్మజ్ఞానం' అనుభవపూర్వకంగా పొందగలుగుతారని, పత్రీజీ అహర్నిశలు శ్రమిస్తూ, విశేషంగా ప్రచారం చేస్తున్నారు.

అంతేకాదు ఈ 'ఆత్మజ్ఞానం' యొక్క అవసరాన్ని, ప్రాముఖ్యతను, గొప్పతనాన్ని వివరిస్తూ పత్రీజీ అనేక పుస్తకాలు వ్రాయడం కూడా జరిగింది. అలాగే 'ఆత్మజ్ఞానం' గురించి అనేక మంది యోగులు వ్రాసిన అనేక పుస్తకాలు సూచించడమే కాదు, తెలుగులోకి అనువదింప చేయడం కూడా జరిగింది. వీటిని చదవడం వల్ల 'ఆత్మజ్ఞానం' యొక్క విశిష్టత తెలుసుకోగలుగుతారని, గొప్పతనం అర్థం చేసుకోగలుగుతారని చెపుతూ 'స్వాధ్యాయం' కూడా చెయ్యమని ప్రోత్సహిస్తున్నారు.

అంతేకాదు ఎంతోమందిని ఆత్మజ్ఞానులుగా తీర్చిదిద్ది వారిచేత కూడా ఈ 'ఆత్మ జ్ఞానం' యొక్క అవసరాన్ని, ఆవశ్యకతను బోధింప చేస్తూ... అందరినీ 'జ్ఞానులుగా', 'ఆత్మజ్ఞానులు'గా తయారు చేయటానికి విశేషంగా కృషి చేస్తున్నారు.

మరి ఇదంతా ఆయన ఎందుకు చేస్తున్నారు? ఎందుకు విశ్రాంతి లేకుండా శ్రమిస్తున్నారు? కృషి చేస్తున్నారు? అంటే ప్రస్తుతం భూమి మీద అందరిలో వున్న 'అజ్ఞానం' తొలగించి అందరినీ జ్ఞానవంతుల్ని చేయటానికే.

మరి మానవులంతా అజ్ఞానంలో వుంటే నష్టమేమిటి? అజ్ఞానం తొలగకపోతే ఏమవుతుంది? జ్ఞానం పొందితే మానవులకు వచ్చే లాభమేమిటి? అంతా జ్ఞానవంతులవుతే ఏమవుతుంది? అన్న విషయాలు అవగాహన

చేసుకోవాలి.

ఎందుచేతనంటే ప్రస్తుతం చాలా మంది పత్రి గారి ఆశయాన్ని అర్థం చేసుకోలేక ఈ ధ్యాన సాధనను 'ఆత్మజ్ఞానం' పొందటానికి కాకుండా, ప్రాపంచిక లాభాలు పొందటానికి, భౌతిక సమస్యలు పరిష్కరించుకోవటానికి, రోగాలు నయం చేసుకోవటానికి, కోరికలు నెరవేర్చుకోవటానికి ఉపయోగించు కుంటున్నారు. భోధించే వారు కూడా వాటి కోసమే 'ధ్యానం' అన్నట్టుగా చెపుతున్నారు. చివరకు ఈ ధ్యాన సాధనను 'ఆరోగ్య సాధన'గా మార్చేసారు.

కానీ **"ఈ ధ్యాన సాధన అన్నది 'ఆరోగ్య సాధన' కాదు 'ఆత్మజ్ఞాన సాధన' అని ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలి".** ఎందుచేతనంటే ఆరోగ్యాన్ని ఇచ్చే సాధనలు, మార్గాలు ప్రపంచంలో వేలకు వేలు వున్నాయి. అలాగే ఆరోగ్య మార్గాలు బోధించేవారు కూడా లక్షల మంది వున్నారు. కానీ 'ఆత్మ జ్ఞానాన్ని' అనుభవపూర్వకంగా ఇవ్వగలిగిన సాధన 'శ్వాస మీద ధ్యాస'! అంటే 'ఆనాపానసతి' అని తెలుసుకోవాలి. ఎందుచేతనంటే ఆరోగ్యాన్ని రకరకాల ప్రక్రియల ద్వారా పొందగలరు, పొందుతున్నారు కూడా. కానీ 'ఆత్మ జ్ఞానాన్ని' అటువంటి ప్రక్రియల ద్వారా పొందలేరు గాక పొందలేరు. కారణం 'ఆత్మజ్ఞానాన్ని' పొందే మార్గం 'ధ్యానం' ఒక్కటే కాబట్టి.

అందుచేత 'ధ్యానం' యొక్క ప్రత్యేకత, విశిష్టత, గొప్పతనం తెలుసు కోవాలంటే, అర్థం చేసుకోవాలంటే ముందు 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలుసుకోవాలి. అందుచేత 'ఆత్మజ్ఞానం' యొక్క విశిష్టత గురించి తెలుసుకుందాం.

ఎందుచేతనంటే లోకంలో యుగయుగాల నుంచి అనేక మంది మహా నుభావులు, ఋషులు, అవతార పురుషులు ఈ 'ఆత్మజ్ఞానం' యొక్క ఆవశ్యకత ను బోధిస్తూనే వున్నారు. తెలియచేస్తున్నారు. వారిలో కొందరిని తెలుసుకుందాం.

- ▲ **ప్రాపంచికంగా ఎక్కువగా ఆశించకుండా జీవించడమే సంపూర్ణ 'ఆత్మజ్ఞానసారం'**
- ▲ **ప్రాపంచికంగా ఏది వస్తున్నా, ఏది పోతున్నా ఎంతమాత్రం చలించకుండా జీవించ గలగడమే సంపూర్ణ 'ఆత్మజ్ఞానసారం'**



# "భగవద్గీత"



అందరూ ఆరాధ్య దైవంగా భావించే శ్రీ కృష్ణ భగవానుడు భారత యుద్ధ సమయంలో, యుద్ధం ప్రారంభం కాకుండానే అర్జునుడు దుఃఖానికి లోనై యుద్ధం చేయగలిగి కూడా చేయలేనివాడిలా, నా వల్ల కాదు అని కూర్చుండిపోయినపుడు అర్జునునకు "ఆత్మజ్ఞానాన్ని" బోధించి, అర్జునుని దుః ఖాన్ని తొలగించి మరల కార్యోన్ముఖుణ్ణి చేసారు.

అలా శ్రీ కృష్ణ భగవానుడు బోధించిన 'ఆత్మ జ్ఞానమే' 'భగవద్గీత'గా లోక ప్రసిద్ధి చెందింది. అంటే శ్రీ కృష్ణ భగవానుడు బోధించింది 'ఆత్మజ్ఞానమే' అని అర్థమవుతుంది. మరి ఆయన ఎందుకు బోధించారు? అంటే అర్జునుని దుఃఖం తొలగించటానికి.

ఇక్కడ శ్రీ కృష్ణ భగవానుడు బ్రహ్మజ్ఞాని. అందుకే దుఃఖానికి, భయానికి లోనుకాలేదు. కానీ అర్జునునకు 'ఆత్మజ్ఞానం' లేదు అందుకే దుఃఖానికి లోనయ్యాడు, భీతి చెందాడు. కానీ 'ఆత్మజ్ఞానం' తెలుసుకోగానే దుఃఖం నుంచి బయటపడ్డాడు, తిరిగి యుద్ధానికి సిద్ధమయ్యాడు. తన ధర్మాన్ని తాను నిర్వర్తించాడు.

దీనిని బట్టి మానవులు దుఃఖం నుంచి బయటపడాలంటే 'ఆత్మజ్ఞానమే'

శరణ్యమని అర్థమవుతుంది. శ్రీ కృష్ణ భగవానుడు అర్జుననకు బోధించాడంటే అర్థం, మానవ జాతి అంతటికీ బోధించినట్టే. దీనిని బట్టి మనం 'ఆత్మజ్ఞానం' యొక్క ఆవశ్యకతను అర్థం చేసుకోవచ్చు.

ఆయన భగవద్గీతలో ఆరాధనలు, ఆరాధనా విధానాలు ఎక్కడా బోధించలేదు, ఆయన బోధించింది అంతా "ఆత్మజ్ఞానమే". కాని మానవులు దుఃఖం నుంచి బయటపడటానికి 'ఆత్మజ్ఞానం' కోసం ప్రయత్నించకుండా 'ఆరాధనలు' చేస్తున్నారు. అంటే శ్రీ కృష్ణ భగవానుడు బోధించింది ఒకటి, మానవులు చేస్తున్నది మరొకటి. అందుకే అంతా దుఃఖంలో వున్నారు. ఎన్ని ఆరాధనలు, ఎంత కాలం చేసినా దుఃఖం నుంచి బయటపడలేకపోతున్నారు.

అంతేకాదు శ్రీ కృష్ణ భగవానుడు చాలా స్పష్టంగా "ఉద్ధరేదాత్మ నాత్మానం" అని చెప్పారు. అంటే ఎవరిని వారే ఉద్ధరించుకోవాలని చెప్పారు. అంటే నిన్ను ఎవరూ ఉద్ధరించలేరు, కాపాడలేరు. నిన్ను నువ్వే 'ఆత్మజ్ఞానం' సంపాదించుకోవటం ద్వారా ఉద్ధరించుకోవాలి, కాపాడుకోవాలి, దుఃఖం నుంచి బయటపడాలని స్పష్టంగా బోధించారు. కానీ మానవులు దీనికి విరుద్ధంగా ప్రవర్తించడం వల్ల, ప్రయత్నించడం వల్ల దుఃఖం నుంచి బయటపడలేక పోతున్నారు. అంటే ఎంతసేపూ తాను ప్రయత్నం చేయకుండా ఎవరినో ఒకరిని ప్రార్థించడం, అర్థించడం, కోరుకోవడం చేస్తున్నారు. అందుకే దుఃఖంలో జీవిస్తున్నారు. ఇదంతా 'ఆత్మజ్ఞానం' లేకపోవడం వల్లే. దీనిని బట్టి 'ఆత్మజ్ఞానం' పొందితే దుఃఖం నుంచి బయటపడవచ్చని తెలుస్తుంది. అందుచేత ప్రతి ఒక్కరూ 'ఆత్మజ్ఞానం' అవసరమని తెలుసుకోవాలి.

## "యోగవాశిష్టం"

అలాగే వశిష్ఠమహర్షి 'యోగవాశిష్టం' ద్వారా శ్రీరామ చంద్రునికి 'ఆత్మ జ్ఞానాన్నే' బోధించడం జరిగింది. ఎందు చేతనంటే ఒకసారి శ్రీరాముడు తన రాజ్యాన్ని పర్యటించడం జరిగింది. అలా ఆయన పర్యటిస్తున్నప్పుడు కొంతమంది దుఃఖంలో వుండటం చూసాడు. అలా చూడగానే ఆయన కూడా దుఃఖానికి లోనయ్యాడు. నారాజ్యంలో దుఃఖంతో వున్నవారు కూడా వున్నారా? అని తాను చింతాక్రాంతుడయ్యాడు. తన అంతఃపురానికి వెళ్ళినా కూడా అదే ఆలోచన. నిద్రాహారాలు మానేసాడు. అలా దుఃఖించే రాముడిని చూసి తండ్రి



దశరథునికి ఏమి చెయ్యాలో పాలుపోలేదు. గురువు గారైన వశిష్ఠ మహర్షిని పిలిపించి శ్రీరాముని దుఃఖం తొలగించమని ప్రార్థించాడు.

అపుడు వశిష్ఠ మహర్షి శ్రీరామునికి 'ఆత్మజ్ఞానం' బోధించాడు. అలా ఆయన చేసిన బోధే "యోగ వాశిష్ఠం" అని పేర్కొనబడింది. అంటే వశిష్ఠ మహర్షి కూడా "యోగవాశిష్ఠం" ద్వారా శ్రీరాముని దుఃఖం తొలగించడానికి "ఆత్మజ్ఞానం" బోధించాడని మనకు తెలుస్తుంది. అంటే శ్రీరాముడంతటి వాడు కూడా 'ఆత్మజ్ఞానం' లేకపోతే దుఃఖానికి లోను కావలసిందేనని మనం అర్థం చేసుకోవచ్చు. దీనిని బట్టి ఏ మానవుడైనా 'ఆత్మజ్ఞానం' లేకపోతే దుఃఖానికి లోనవుతారని 'ఆత్మజ్ఞానం' పొందకపోతే దుఃఖం నుంచి బయటపడలేరని తెలుస్తుంది. అందుచేత 'ఆత్మజ్ఞానం' ప్రతి మనిషికి చాలా చాలా అవసరమని మనం తెలుసుకోవచ్చు.

## "గౌతమ బుద్ధుడు"

అంతేకాదు బుద్ధ భగవానుడు రాజపుత్రునిగా వున్నపుడు పేదరికం తో యాచన చేస్తూ భాధపడుతున్న వాడిని, రోగంతో బాధపడుతున్న వాడిని, వృద్ధాప్యంతో బాధపడుతున్న వాడిని, అలాగే మరణించిన వాడిని చూసి తాను దుఃఖానికి లోన య్యాడు. ఆయన ఆలోచించాడు. ఏమిటి? మానవులు ఇలా దుఃఖానికి లోను కావలసిందేనా? దుఃఖం నుంచి బయటపడలేరా? దుఃఖం



లేకుండా జీవించలేరా? అని అనేకరకాలుగా ఆలోచించడమే కాదు. మానవులు ఇలాంటి దుఃఖాలలోంచి బయట పడాలంటే మార్గమేమిటి? అని కూడా ఆలోచించాడు. రాజ్యాన్ని, సంసారాన్ని వదిలి దుఃఖాన్ని నివారించగలిగే మార్గాన్ని కనుగొనటానికి బయలు దేరాడు. ఆయన రక రకాల గురువులను ఆశ్రయించి వారి ద్వారా నేర్చుకున్న రకరకాల కఠోర సాధనలను చేసి వాటి వల్ల ప్రయోజనం లేదని తెలుసుకుని చివరకు తన 'శ్వాస మీదే తాను' ధ్యాస వుంచాడు అంటే "ఆనాపానసతి" ధ్యానం చేసాడు.

అలా 'శ్వాస మీద ధ్యాస' ఉంచగానే ఆయనకు జ్ఞానోదయమైంది. అపారమైన జ్ఞానాన్ని అంటే 'ఆత్మజ్ఞానాన్ని' తాను అనుభవపూర్వకంగా తెలుసుకున్నాడు. మానవుడు అన్ని రకాల దుఃఖాల నుంచి బయటపడాలంటే! అంటే 'నిర్వాణం' పొందాలంటే! "ఆత్మజ్ఞానం" అవసరమని తెలుసుకున్నాడు. దానికి "శ్వాస మీద ధ్యాస" వుంచడమే మార్గమని తెలుసుకున్నాడు. తరువాత ఆయన ప్రపంచమంతా పర్యటించి ఆ మార్గాన్ని అంటే ధ్యానాన్ని అందరికి బోధించి ఎంతోమందిని "ఆత్మజ్ఞానులు"గా తయారు చేయడం జరిగింది. అంతులేని దుఃఖంతో జీవిస్తున్న ఎన్నో లక్షల మంది జీవితాలలో ఆనందాన్ని, శాంతిని కలుగచేయడం జరిగింది. అంటే బుద్ధ భగవానుని జీవితం నుంచి కూడా 'ఆత్మజ్ఞానం' అవసరమని మనం తెలుసుకోవచ్చు.

గమనిస్తే పై వారంతా అంటే 'ఆత్మజ్ఞానం' యొక్క ఆవశ్యకతను

మానవ లోకానికి బోధించడానికి వచ్చిన అవతార పురుషులని మనకు తెలుస్తుంది. అలా యుగయుగాల నుంచి 'ఆత్మజ్ఞానం' యొక్క ఆవశ్యక తను ఎందరో మహానుభావులు బోధించడం జరుగుతూనే వుంది.

## "శ్రీ ఆదిశంకరాచార్యులు"



అంతేకాదు ఈ మధ్య కాలంలో అవతరించిన శ్రీ ఆదిశంకరాచార్యుల వారు.... వారిని శ్రీ శంకర భగవత్పాదులు అంటారు, సాక్షాత్తూ శంకరుడే అంటారు. ఆయన కూడా భారతదేశమంతా అంటే కాశ్మీరు నుంచి కన్యాకుమారి వరకు నాలుగు సార్లు కాలినడకన పర్యటించి, అందరికీ 'ఆత్మజ్ఞానాన్ని' బోధించారు.

కారణం ఆయన అవతరించిన సమయంలో భారత దేశంలో మానవు లంతా అజ్ఞాన కారణంగా అంటే 'ఆత్మజ్ఞానం' లేకపోవడం వల్ల ఒకరినొకరు ద్వేషించుకుంటూ, దూషించు కుంటూ, కలహించుకుంటూ నిత్యం కొట్లాటలతో జీవించేవారు. ఎవరికి వారు మేమే గొప్ప, మా కులమే గొప్ప, మా మతమే గొప్ప, మా మార్గమే గొప్పది అనుకుంటూ ఒకరిని ఒకరు విభేధించుకుంటూ, ద్వేషించుకుంటూ చేయకూడని పనులు చేస్తూ, ఒకరినొకరు నష్టపరచుకుంటూ చివరకు అంతా దుఃఖంలో జీవించేవారు. దీనికంతటికీ వారి అజ్ఞానమే కారణం.

అలా అజ్ఞానంలో దుఃఖంతో అలమటిస్తున్న వారికి శ్రీ ఆది శంకరాచార్యుల వారు 'ఆత్మజ్ఞానాన్ని' బోధించి మీరందరూ వేరు వేరు కాదు,

అంతా ఒక్కటే అన్న జ్ఞానాన్ని బోధించి వారి మధ్య సామరస్యాన్ని నెలకొల్పి, సఖ్యత చేకూర్చి, వారిలో స్నేహపూర్వకమైన వాతావరణాన్ని సృష్టించి, వారందరికి శాంతిని, ఆనందాన్ని కలుగ చేసారు. ఇటువంటి స్థితి ఆయన బోధించిన 'ఆత్మజ్ఞానం' వల్లనే కలిగింది తప్ప. మరే దాని వల్ల వారిలో మార్పు రాలేదు.

ఆఖరికి ఆయన వుండే సమయంలో ప్రపంచాన్ని, ప్రజలను మార్చాలని సిద్ధులు, శక్తులు సంపాదించిన సిద్ధునికి కూడా అది సాధ్యం కాలేదు. అంటే మనం సిద్ధులు, శక్తులు సంపాదించినా దుఃఖం నుంచి బయటపడలేము సరి కదా ఎవరి దుఃఖాన్ని మనం తొలగించలేమని అర్థమవుతుంది. అది ఒక్క ఆత్మజ్ఞానికే సాధ్యమని, 'ఆత్మజ్ఞానం' వల్లనే సాధ్యమని శ్రీ శంకరాచార్యుల జీవితాన్ని బట్టి మనం తెలుసుకోవచ్చు. దీనిని బట్టి 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం మనకు స్పష్టంగా అర్థమవుతుంది.

అంతేకాదు 'ఆత్మజ్ఞానాన్ని' బోధించడానికి అవతరించిన శ్రీశంకరాచార్యుల వారు భారతదేశమంతా పర్యటిస్తూ జ్ఞానాన్ని బోధించే సమయంలో ఆయనకు ఎన్నో కష్టాలు ఎదురయ్యాయి, ఎన్నో ఆటంకాలు కలిగాయి, ఎన్నో బాధలు పడ్డారు. కానీ వాటన్నిటినీ ఆయన సునాయాసంగా అధిగమించ గలిగారు. కారణం ఆయనకు ఎప్పుడూ అదృశ్య రూపంలో వున్న మాష్టర్సు సహాయ పడేవారు, సాయం చేసేవారు, వారు ఆ క్లిష్ట పరిస్థితిని తేలికగా అధిగమించేందుకు సహాయం చేసేవారు, దీనంతటికీ శ్రీ శంకరాచార్యుల వారు చేసే 'ఆత్మజ్ఞాన' బోధే కారణమనిని తెలుస్తుంది.

అందుచేత తెలుసుకోండి లోకంలో ఎవరు గొప్పవారు? అంటే ఆత్మజ్ఞానే గొప్పవాడు. అలాగే మానవులు చేసే పనులన్నిటి కంటే ఏ పని గొప్పది? అంటే ఆత్మజ్ఞాన బోధ అంటే అందరిని ఆత్మజ్ఞానులుగా చేయడమే గొప్పదని తెలుస్తుంది.

అసలు మానవ జీవిత లక్ష్యమే 'జ్ఞాని' కావడం. అందరికీ 'జ్ఞానబోధ' చెయ్యడం. అంతేకాదు మానవుడు భూమి మీదకు వచ్చింది, అంటే జన్మ తీసుకున్నది అందుకోసమే కానీ 'ఖానా, పీనా, సోనా' అంటే "తినటం, త్రాగటం, నిద్రించటం" కోసం మాత్రం కాదు. ఏదో భూమి మీదకు వచ్చాం కాబట్టి, శరీరం తీసుకున్నాం కాబట్టి జ్ఞానం సంపాదించటానికి శరీరం అవసరం

కాబట్టి, శరీరం వుండాలంటే ఆహారం, నీరు, నిద్ర అవసరం కాబట్టి ఆ పనులు చేస్తున్నాం. అంతేకాని "ఖానా, పీనా, సోనా" కోసమే జీవితం కాదని తెలుసుకోవాలి.

అందుచేత 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలుసుకోండి. 'ఆత్మజ్ఞానం' సంపాదించుకోవటానికి ప్రయత్నించండి. 'ఆత్మజ్ఞానాన్ని' కలిగించే 'ధ్యాన సాధన' చెయ్యండి. ఆత్మజ్ఞానులుకండి. అందరికంటే గొప్పవారు కండి.

అంతెందుకు ప్రస్తుత కాలంలో ఒక రమణ మహర్షిని కాని, రామకృష్ణ పరమహంసని కాని, స్వామి వివేకానందని కాని, శ్రీ పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వామిని కాని, శ్రీ రాఘవేంద్ర స్వామిని కాని, యోగి వేమనను కాని, షిరిడి సాయిబాబాను కాని, అవతార్ మెహర్‌బాబాని కానీ, సత్యసాయిబాబాని కానీ, యోగానంద పరమహంసను కాని, పరమయోగి కబీరుని కాని, ఎవరిని చూసినా అంతా ఆత్మజ్ఞానులే, అంతా 'ఆత్మ జ్ఞానాన్ని' బోధించిన వారే! ఆత్మజ్ఞానం యొక్క విశిష్టతను వివరించిన వారే! అందరినీ ఆత్మజ్ఞానులుగా తయారు చెయ్యడానికి కృషి చేసినవారే! అందరూ విశేషంగా ధ్యాన సాధన చేసినవారే!

వారే కాదు బుద్ధుడు, శ్రీ కృష్ణునితో పాటు జీసస్, మహ్మద్ ప్రవక్త, వర్థమాన మహావీరుడు, గురునానక్ ఇలా ఎవరిని తీసుకున్నా అంతా గొప్ప గొప్ప జ్ఞానులే. లోకాన్ని ఉద్ధరించడానికి వచ్చిన వారే. అంటే అజ్ఞానంలో వున్నవారిని జ్ఞానులుగా మార్చడానికి వచ్చినవారే!

అందుచేత వీరందరి బోధలను బట్టి 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం మనం తెలుసుకోవచ్చు. తెలుసుకోవాలి కూడా! తెలుసుకోవడమే కాదు. జ్ఞానం సంపాదించుకోవాలి. అందుచేత 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలుసుకుందాం. 'ఆత్మజ్ఞానం' పొందితే వచ్చే లాభాలు తెలుసుకుందాం. అలాగే అజ్ఞానంలో వుంటే వచ్చే నష్టాలు కూడా తెలుసుకుందాం.

## "ఆత్మజ్ఞానం యొక్క గొప్పతనం"

ఒక విధంగా జ్ఞానాన్ని వెలుగుతో పోలుస్తారు. అజ్ఞానాన్ని చీకటితో పోలుస్తారు. వెలుగులో జీవించే వారి జీవితం ఎలా వుంటుందో 'జ్ఞాని' జీవితం కూడా అలాగే వుంటుందని తెలుసుకోవాలి. అలాగే చీకటిలో వుండేవారి జీవితం ఎలా వుంటుందో 'అజ్ఞాని' జీవితం కూడా అలాగే వుంటుందని

తెలుసుకోవాలి.

చిన్న ఉదాహరణ చూద్దాం మీరు రాత్రి భోజనం చేద్దామనుకున్నారు. సరిగ్గా అదే సమయంలో కరెంటు పోయింది. అమావాస్య కారణంగా కటిక చీకటి. మీ ఇంట్లో బ్యాటరీ లైటు కాని, కొవ్వొత్తి కానీ ఏదీ లేదు. ఏ దీపం వెలిగించటానికి అవకాశం లేదు. చేసేది లేక ఆ చీకటిలోనే భోజనం చెయ్యడానికి ఉపక్రమించారు. అపుడు మీరు వంటగదిలోకి వెళ్ళాలంటే తడుముకుంటూ వెళ్ళాలి. అలా వెళ్ళేటపుడు గుమ్మానికి తగలవచ్చు. గోడకు తగలవచ్చు. అలా తడుముకుంటున్నప్పుడు ఏదైనా కాలికి తగిలితే క్రింద పడిపోయే ప్రమాదం కూడా వుంది. అలా వంటగదిలోకి వెళ్ళిన తరువాత కంచాలు తడమాలి, గ్లాసులు తడమాలి. అవి తీసేటపుడు క్రింద పడవచ్చు. కాలి మీద కూడా పడవచ్చు. అవి క్రింద పెట్టి అన్నం గిన్నె వెతకాలి, కూర గిన్నె వెతకాలి, అలా అన్నీ తడుముతూ వెతకాలి. కంచంలో అన్నం పెట్టుకోవాలన్నా, కూర పెట్టుకోవాలన్నా ఆ చీకట్లో ఎంత కష్టమో వూహించు కోండి. ఏదో రకంగా తడుముతూ పెట్టుకున్నామనుకోండి. అన్నంలో కూర కలుపుకోవాలంటే ఎంత ఇబ్బంది. కూరలో మిరపకాయలు కనిపించవు అలాగే తింటే నోరు మండిపోతుంది. మరల మంచినీళ్ళ కోసం ఇబ్బంది.

ఊహించుకోండి! అలా చీకట్లో భోజనం చెయ్యాలంటేనే ఇన్ని ఇబ్బందులు పడవలసి వస్తే! చీకట్లో ప్రయాణించాలన్నా, ఏ పనులు చెయ్యాలన్నా ఎన్ని ఇబ్బందులో వూహించండి... దారిలో గోతులు కనపడవు, రాళ్ళు కనపడవు, అలా పడుతూ లేస్తూ వుంటే ఎన్ని ఇబ్బందులో, ఎంత కష్టమో వూహించండి. దీనిని బట్టి చీకట్లో జీవించాలంటే అన్నీ కష్టాలే. అంతా ఇబ్బందే కదా? అలాగే అజ్ఞానపు జీవితమంతా కష్టాలే. అన్నీ బాధలే. అందుకే అజ్ఞానాన్ని చీకటితో పోల్చారు.

అలాగే అనుకోకుండా కరెంటు వచ్చింది. లైట్లు వెలిగాయి. అపుడు చూడండి ఎంత వేగంగా నడుస్తారో! ఎలా పనులు చకచకా చేసుకుంటారో! ఏది ఎక్కడ వుందో తెలుస్తుంది. ఏది ఎక్కడ పెట్టాలో తెలుస్తుంది. అంతా సుఖమే. అంతా ఆనందమే. ఏ కష్టం వుండదు. ఇదంతా వెలుగు వల్లే. అంటే వెలుగులో జీవించడం ఎంత సుఖమో! ఎంత ఆనందం కలిగిస్తుందో! అలాగే జ్ఞాని జీవితం అంత సుఖంగా, ఆనందంగా వుంటుంది. కారణం

**'జ్ఞాని ఏది చెయ్యాలో అది చేస్తాడు... ఏది చెయ్యకూడదో అది చెయ్యడు'. 'ఎలా జీవించాలో అలా జీవిస్తాడు... ఎలా జీవించకూడదో అలా జీవించడు'.** కారణం ఆ జ్ఞానం వుంది కనుక.

దీనిని బట్టి చీకటిలో జీవించేవాడి జీవితం ఎలా వుంటుందో అజ్ఞాని జీవితం కూడా అలాగే వుంటుంది. అలాగే వెలుతురులో జీవించే వాడి జీవితం ఎలా వుంటుందో జ్ఞాని జీవితం కూడా అలాగే వుంటుందని తెలుసుకోవాలి. ఇది ఒక ఉదాహరణ మాత్రమే. ఇదేకాదు మనం జ్ఞానికి, అజ్ఞానికి వున్న తేడాలు, లాభ నష్టాలు ఇంకా ఎన్నో తెలుసుకోవచ్చు.

అందుకే **"తమసోమా జ్యోతిర్గమయ"** అని శాంతి మంత్రంలో చెప్పబడింది. అంటే చీకటి నుండి వెలుగులోకి నడిపించు అని ప్రార్థిస్తారు.

కారణం చీకట్లో ఏదైనా వున్నా లేదనుకుంటాం. అలాగే లేకపోయినా వుందనుకుంటాం. కానీ వెలుతురులో వున్నది వున్నట్టుగాను, లేనిది లేనట్టుగాను తెలుసుకోగలుగుతాం. చిన్న ఉదాహరణ కరెంటు పోయింది, మీరు టేబుల్‌పై బ్యాటరీ లైటు కోసం ఎప్పుడూ పెట్టిన చోట తడుముతున్నారు. కానీ ఆ లైటు మీ భార్య అంతకు ముందే వంట గదిలో పెట్టటం జరిగింది. కానీ మీరు వెతుకుతున్నారు, తడుముతున్నారు. కారణం చీకటి. అదే కనుక వెలుతురు వుంటే వెతకరు, తడమరు. లైటు లేదని వెంటనే తెలుసుకుంటారు. ఈ బ్యాటరీ లైటు ఏమైందని మీ భార్యని అడుగుతారు. కారణం వెలుగు.

చూశారా చీకటిలో లేనిది వుందనుకున్నారు. ఒక్కొక్కసారి వున్నదాన్ని లేదని కూడా అనుకోవచ్చు. కానీ వెలుగులో వున్న దాన్నే వుందనుకుంటారు. లేనిదాన్ని లేదనుకుంటారు.

అదే విధంగా అజ్ఞాని కూడా ఈ సృష్టిలో వుండని వాటిని వుండేవ నుకుంటాడు. వుండే దానిని లేదనుకుంటాడు. ఉదాహరణకు ఈ సృష్టిలో మన కంటికి కనిపించేవన్నీ వుండనివే అంటే కొంతకాలానికి అదృశ్యమయ్యేవే, అంటే 'ఏదీ శాశ్వతం కాదు'. కానీ అజ్ఞాని అన్నీ వుండేవనుకుంటాడు. వాటి కోసం ఆరాటపడతాడు, ప్రయత్నిస్తాడు, ఆశపడతాడు, కష్టపడుతూ వుంటాడు. తప్పులు చేస్తాడు, పాపాలు చేస్తాడు. సృష్టి విరుద్ధంగా, అధర్మంగా ప్రవర్తిస్తాడు. చివరకు వాటి ఫలితంగా నష్టపోతాడు, కష్టాలపాలవుతాడు. జీవితాన్ని దుః ఖమయం చేసుకుంటాడు. దీనికంతటికీ అజ్ఞానమే కారణం.

ఎందుచేతనంటే ఉండనివన్నీ ఉండేవనుకుంటాడు. ఉండని వారంతా ఉండేవారనుకుంటాడు, ఆఖరికి ఉండని తాను కూడా ఉండేవాడిననుకుంటాడు కాబట్టే ఈ తాపత్రయం, ఈ ఆరాటం, ఈ పోరాటం.

అంతేకాదు ఎవరు ఎక్కడి నుంచి వచ్చారో తెలియదు. ఎవరు ఎక్కడికి పోతారో తెలియదు. ఎవరికి ఎవరు ఏమవుతారో తెలియదు. వున్న కాసేపే ఈ బంధుత్వాలు, మమకారాలు, రాగద్వేషాలు అన్నీ కూడా.

అందుకే శ్రీ ఆది శంకరాచార్యుల వారు ఇలా అన్నారు.

**కాతేకాంతా కస్తే పుత్రః**
**సంసారో యమతీవ విచిత్రః**
**కస్యత్వం కః కుత ఆయాతః**
**తత్వం చింతయ తదిహ భ్రాతః**

తా:- ఓయీ సోదరుడా! ఎవరు నీ భార్య? నీ పుత్రుడెవరు? ఈ సంసారం అత్యంత విచిత్రమైనది. ఇంతకీ నీవెవరికి చెందిన వాడివి? ఎక్కడి నుంచి ఇక్కడికి వచ్చావు? ఈ తత్వ విచారణ చేస్తే నీ భ్రాంతి మోహాలన్నీ పటాపంచలవుతాయి.

ఆయన ఇంకా ఇలా అన్నారు.

**మా కురు ధన జన యౌవ్వన గర్వం**
**హరతి నిమేషత్కాలః సర్వమ్ !**
**మాయామయమిధ మఖిలం భూత్వా**
**బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా.**

తా:- నాకింత ధనమున్నది, నాకింత మంది అండదండగా వున్నారు, నేను మంచి యవ్వనంలో శక్తిసామర్ధ్యాలతో తులతూగుతున్నానని ఎక్కువగా వ్యర్థంగా గర్వించకు. వీటన్నింటినీ కాలం క్షణంలో హరించి వెయ్యగలదని తెలుసుకో. నిన్ను మోహంలో ముంచుతున్న ధన, జన, యౌవనాదులన్నీ మాయామయాలు. స్వప్న దృశ్య పదార్థాల్లా... వున్నంత సేపూ నిజమనిపిస్తూనే చటుక్కున మాయమైపోతాయి. అంచేత అనిత్యమైన మాయామయ జగత్తును నమ్ముకోక నిత్యమైన 'బ్రహ్మ' పదార్థాన్ని అంటే 'ఆత్మ'ను తెలుసుకుని దానిని చేరుకో అని శ్రీ ఆది శంకరాచార్యుల వారు బోధించడం జరిగింది.

అంటే ఇవన్నిటికి అజ్ఞానమే కారణం. ఇటువంటి అజ్ఞానం వల్ల ఈ భ్రాంతులతో, మమకారంతో చేయకూడని పనులు చేస్తున్నాడు. తప్పులు చేస్తున్నాడు. పాపాలు చేస్తున్నాడు చివరకు కష్టాల పాలవుతున్నాడు.

అంతేకాదు అజ్ఞానంలో వున్నవాడు కుటుంబ, కుల, మత, ప్రాంత వివక్ష కలిగి వుంటాడు. అంటే తన కుటుంబం వేరు, ఇతర కుటుంబాల వారు వేరు అనుకుంటాడు. అలాగే తన కులం వేరు, ఇతర కులాల వారు వేరు అనుకుంటాడు. తన మతం వేరు, ఇతర మతాల వారు వేరు అని అనుకోవడమే కాదు. ఆఖరికి తన ప్రాంతం వారు వేరు, ఇతర ప్రాంతాల వారు వేరు అని కూడా భావిస్తూ ఇతరులను ద్వేషిస్తూ తన వారిని అభిమానిస్తూ... అలా రాగద్వేషాలు ప్రదర్శిస్తూ ఇతరులతో కలహాలకు, కొట్లాటలకు దిగుతూ జీవితంలో అశాంతిని, దుఃఖాన్ని సృష్టించుకుంటున్నాడు. దీనికంతటికీ అజ్ఞానమే కారణం.

అంతేకాదు అజ్ఞాన కారణంగా అంతా వేరు వేరు అనుకోవడం వల్ల అందరికంటే తాను అధికుడనవ్వాలని, అందరి కంటే గొప్పగా వుండాలని భావిస్తూ, ఇతరులను మోసగిస్తూ, తప్పులు చేస్తూ, అవసరానికి మించి సంపాదిస్తూ, కూడపెడుతూ... సృష్టి విరుద్ధంగా ప్రవర్తిస్తూ జీవితాన్ని దుః ఖమయం చేసుకుంటున్నాడు. ఇదంతా అజ్ఞానం వల్లనే.

కానీ జ్ఞాని కంటికి కనిపించేవి అంటే, ప్రాపంచికమైనవి ఏవీ వుండవని, వుండేవి కావని అర్థం చేసుకుంటాడు. వాటి పైన మమకారం పెంచుకోడు. వాటి కోసం తాపత్రయపడడు. వాటి కోసం తప్పులు, పాపాలు చెయ్యడు. సృష్టి విరుద్ధంగా, ధర్మ విరుద్ధంగా ప్రవర్తించడు. కారణం అవేవి వుండేవి కావని తెలుసుకొబట్టి.

అంతేకాదు జ్ఞాని ఈ సృష్టిలో వుండేది భగవంతుడు ఒక్కడే అంటే 'ఆత్మ' ఒక్కటే అని తెలుసుకుంటాడు. అందుచేత భగవంతుణ్ణి అంటే 'ఆత్మ'ను ఆశ్రయిస్తాడు. ఆత్మ గురించి తెలుసుకునే ప్రయత్నం చేస్తాడు. 'ఆత్మ'కు సంబంధించిన జ్ఞానం సంపాదించుకుంటాడు. 'ఆత్మ' యొక్క గొప్పతనం తెలుసుకుంటాడు. 'ఆత్మ'ను సాక్షాత్కరించుకునే ప్రయత్నం చేస్తాడు. చివరకు సాధిస్తాడు. జీవితం ధన్యం చేసుకుంటాడు. కానీ అజ్ఞానికి 'భగవంతుడు' అంటే 'ఆత్మ' కనిపించక పోవడం వల్ల వున్నా లేదనుకుంటాడు. వుండని 'విగ్రహమే' దైవమనుకుంటాడు. 'విగ్రహాన్నే' ఆశ్రయిస్తాడు. ఆరాధిస్తాడు. చివరకు భంగపడతాడు. అంటే 'అసత్యాన్ని సత్యమనుకుంటాడు'. 'సత్యాన్ని అసత్యమనుకుంటాడు'. అసత్యాన్ని అంటే 'విగ్రహాన్ని' ఆశ్రయించి దుఃఖాల పాలవుతాడు.

# ఆత్మజ్ఞానం యొక్క గొప్పతనం తెలియకపోతే!

'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలియనివారు ధ్యాన సాధనను అల్ప లాభాలైన ఆరోగ్యానికి అంటే రోగాలు నయం చేసుకోవడానికి, కోరికలు నెరవేర్చుకోవటానికి, అనుభవాలనే సరదాలు తీర్చుకోవటానికి ఉపయోగించు కుంటారు. ప్రాపంచిక లాభాల కోసమే ధ్యానం చేస్తారు. ధ్యానం అందుకోసమే అనుకుంటారు. ధ్యానాన్ని బోధించేవారు కూడా ఆ లాభాలు వస్తాయనే బోధిస్తారు. కారణం వారికి కూడా 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలియక పోవడం వల్లే.

అందుచేత రోగాల కోసం ధ్యానం చేసేవారు కొంతకాలం ధ్యానం చేసి తరువాత మానేస్తున్నారు. వారు ఇంత గొప్ప ధ్యాన సాధనను డాక్టరు ఇచ్చే ఒక మందులా భావిస్తున్నారు. ఎందుచేతనంటే రోగం కోసం మందు వాడే వారు రోగం తగ్గగానే మందు మానేస్తారు. ఒక వేళ తగ్గకపోయినా ఇది సరైన మందు కాదని మానేసి మరొక డాక్టరు వద్దకు వెళ్తారు.

అలాగే ధ్యానం చేసేవారు రోగం తగ్గగానే ధ్యానం మానేస్తున్నారు. ఒకవేళ రోగం తగ్గకపోయినా ఇందులో లాభం లేదని మానేయడమే కాదు. మరొక సాధనా మార్గంలోకి వెళుతున్నారు. ఇంకొక గురువును ఆశ్రయిస్తున్నారు. ఏది ఏమైనా రోగాల కోసం ధ్యానం చేసేవారు తగ్గినా... ధ్యాన సాధన ఆపేస్తున్నారు, తగ్గకపోయినా... సాధన ఆపేస్తున్నారు. ఇదంతా 'ధ్యానం' యొక్క గొప్పతనం, 'ధ్యాన సాధన' ద్వారా వచ్చే 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలియకపోవడమే.

వారి అదృష్టం కొద్దీ ఇంత గొప్ప మార్గంలోకి వచ్చినా దాని విలువ తెలియకపోవడం వల్ల వచ్చిన అవకాశాన్ని చేజార్చుకుంటున్నారు. జీవితంలో ఎంతో నష్టపోతున్నారు. ఒక రకంగా ఒక జన్మనే వారు వ్యర్థం చేసుకున్న వారవుతున్నారు.

ఇటువంటి సందర్భాన్ని పురస్కరించుకుని శ్రీ విద్యాప్రకాశనందగిరి స్వామి వారు చెప్పే ఒక చిన్న కథను మనం గుర్తు చేసుకోవచ్చు.

ఒక గ్రామంలో ఒక పేదవాడు ప్రతీరోజూ దగ్గరలో వున్న అడవికి

వెళ్ళి కట్టెలు కొట్టి, గ్రామానికి తెచ్చుకుని అమ్మి ఆ డబ్బుతో కుటుంబాన్ని పోషించుకునేవాడు.

ఒక రోజు తొందరగా నిద్రలేవడం వల్ల, ఆ చీకట్లోనే అడవికి వెళ్ళాడు. ఆ చీకట్లో చేసేది లేక నది ఒడ్డున ఒక చెట్టు క్రింద కూర్చున్నాడు. వెలుతురు రాగానే తన పని ప్రారంభిద్దామనుకున్నాడు. ఇంతలో అతని కాలికి ఒక చిన్న మూట తగిలింది. ఆ చీకట్లో దాన్ని విప్పి చేతితో తడిమాడు. అది రాళ్ళమూట.

అతనేం చేశాడంటే ఎలాగూ తోచట్లేదు కాబట్టి కాలక్షేపం కోసం అందులోంచి ఒక్కొక్క రాయి తీసి నదిలో విసరడం మొదలు పెట్టాడు. నదిలో వచ్చే "డుం" "డుం" "డుం" అనే శబ్దం అతనికి సరదాగా అనిపించింది. మెల్లిగా రాళ్ళు నదిలోకి అలా విసురుతున్నాడు. ఇంతలో తెల్లారింది. వెలుతురు వచ్చింది. మూటలో రాళ్ళు అన్నీ అయిపోయియి. చేతిలో ఆఖరి రాయి వుంది. అది కూడా విసురుదామనుకున్నాడు. కానీ వెలుతురులో చూస్తే అది రాయి కాదు. తళతళా మెరుస్తున్న 'వజ్రం'.

వాడు ఆశ్చర్యపోయాడు ఏమిటి? ఇంతవరకు నేను నీళ్ళలో వేసింది వజ్రాలా? అంటే నాకు దొరికింది వజ్రాల మూటా? రాళ్ళ మూట అనుకున్నానే? అరె ఎంత మూర్ఖుడిని? వజ్రాలన్నీ నదిలోకి విసిరేశానే? ఎంత తెలివితక్కువ పని చేసాను? భగంవంతుడు నాకు కల్పించిన అదృష్టాన్ని చేజేతులా జార్చుకున్నానే? నేను ఈ చీకటి పోయే దాకా ఆగి వుంటే నాకు భగవంతుడు కల్పించిన ఈ అదృష్టంతో నా కరువంతా తీరిపోయేది కదా? నా పేదరికమంతా పోను కదా? నా కష్టాలన్నీ తీరిపోను కదా? ఎంత దురదృష్టవంతుణ్ణి? అని తలచుకుంటూ ఎంతో బాధపడ్డాడు. కానీ ఏమి లాభం? అంతా అయిపోయింది. ఇప్పుడు చేసేది ఏమీ లేదు. చీకటి వల్ల వజ్రాలను రాళ్ళనుకుని దొరికిన అదృష్టాన్ని తానే చేజార్చుకున్నాడు. ఎంతో నష్టపోయాడు.

ఈ కథను బట్టి మనం గ్రహించవలసిందేమిటంటే ఆ మూటలోనివి వజ్రాలే కానీ ఆ పేదవాడు రాళ్ళనుకుని నదిలో వేసాడు, కారణం 'చీకటి'. అదే కనుక వెలుతురు వుంటే వాటి విలువ తెలుసుకునేవాడు. అలా చేయడు కూడా! కానీ చీకటి వల్ల, విలువ తెలియకపోవడం వల్ల దొరికినా ఉపయోగించుకోలేక పోయాడు.

అలాగే లోకంలో 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలియకపోవడం వల్ల వజ్రం లాంటి 'ధ్యానాన్ని' సామాన్య సాధనగా భావిస్తూ నిర్లక్ష్యం చేస్తూ, ప్రాముఖ్యం ఇవ్వక, ధ్యానం చెయ్యక ఎంతో నష్టపోతున్నారు. ఈ మార్గంలోకి వచ్చిన వారు, ధ్యానం తెలిసిన వారు కూడా ధ్యానాన్ని వదిలివేస్తున్నారు, సరిగా ధ్యానం చేయటం లేదు. తక్కువగా చూస్తున్నారు. దీనికంతటికీ 'అజ్ఞానమే' కారణం.

పాపం వాడు వెలుతురు వచ్చే వరకు ఆగి వుంటే వాడి కష్టాలన్నీ తీరిపోను. అలాగే 'ధ్యాన' మార్గంలోకి వచ్చిన వారు కొద్దిపాటి 'జ్ఞానం' కలిగే వరకు 'ధ్యానాన్ని' వదలకుండా ఈ మార్గంలో కొనసాగితే అసలైన, అద్భుతమైన ఫలితాలు పొందగలిగే వారు. వారు ఒక్క అనారోగ్యమే కాదు తప్పనిసరిగా అన్ని రకాల సమస్యల నుంచి, కష్టాల నుంచి బయటపడేవారు. తాత్కాలికంగానే కాదు శాశ్వతంగా కూడా బయటపడేవారు. కానీ 'ధ్యానాన్ని' ఆరోగ్య సాధనగా భావించి వదిలివేయడం వల్ల జీవితంలో వచ్చిన అతి గొప్ప అవకాశాన్ని వారు కోల్పోతున్నారు, ఎంతో నష్టపోతున్నారు.

అందుచేత తెలుసుకోండి. ధ్యాన సాధన విశేషంగా చేసేవారు ధ్యాన లక్ష్యమైన, జీవిత లక్ష్యాన్ని అంటే 'ఆత్మజ్ఞానాన్ని' పొందగలరు. అటువంటి వారు ధ్యాన సాధనా మార్గంలో 'ఆత్మజ్ఞానం' పొందేలోపు ఎన్నో లాభాలు కూడా పొందగలరు. ఆ లాభాలలో రోగం అన్నది ఒక చిన్న అల్పమైన లాభమని, అది 'జ్ఞానం' పొందేటపుడు వచ్చే ఒక 'బైప్రోడక్టు' (ఉప ఉత్పత్తి) అని తెలుసుకుంటారు.

చిన్న ఉదాహరణ చూద్దాం. మిల్లులో ధాన్యం (వడ్లు) నాణ్యమైన బియ్యం కోసం. ఆడిస్తారు. కానీ అలా ధాన్యం మిల్లులో ఆడించేటపుడు ముందుగా వూక పొట్టు వస్తుంది, దూగర వస్తుంది, చిట్టు వస్తుంది, తవుడు వస్తుంది, నూకలు వస్తాయి. ఇలా ఎన్నో వస్తాయి... చివరకు బియ్యం వస్తుంది. అంటే బియ్యం వచ్చే లోపులో వచ్చేవన్నీ ఉప ఉత్పత్తులు (బైప్రోడక్ట్స్) అంటారు. అవి ఎలాగూ వస్తాయి. కానీ ధాన్యం ఆడించేవారు బియ్యం కోసం చూడకుండా వూక పొట్టు వచ్చిందా? లేదా? అని చూస్తారా? చూడరు కదా? చూస్తే నిజంగా వాడు తెలివితక్కువ వాడే కదా?

అలాగే ప్రస్తుతం 'ధ్యాన సాధన' చేసేవారు జీవిత లక్ష్యమైన 'నిర్వాణం'

అంటే అన్ని రకాల కష్టాల నుంచి శాశ్వతంగా బయటపడగల 'ఆత్మజ్ఞానం' కోసం చూడకుండా... పూక పొట్టు లాంటి రోగాలు, మరికొన్ని ప్రాపంచిక లాభాలు, కొన్ని అనుభవాలతో తృప్తి పడితే నిజంగా వారిని తెలివి తక్కువ వారేనని అనుకోవచ్చు. ఎందుచేతనంటే ధాన్యం వేసినపుడు బియ్యం వచ్చే లోపులో మిగిలినవన్నీ ఎలాగూ వస్తాయి. చూసినా వస్తాయి. చూడకపోయినా వస్తాయి. కానీ చూడవలసింది బియ్యం. వారికి కావలసింది బియ్యం.

అలాగే ధ్యాన సాధన చేసేటపుడు 'ఆత్మజ్ఞానం' పొందేలోపు రోగాలు తగ్గుతాయి, మనశ్శాంతి లభిస్తుంది, కొన్ని శారీరక రుగ్మతలు పోతాయి, జ్ఞాపకశక్తి పెరుగుతుంది, బుద్ధి వికసిస్తుంది. ఇలాంటి వాటితో పాటు అనుభవాలు అంటే మూడవకన్ను ఉత్తేజితమవడం, సూక్ష్మ శరీరయానం చేయడం, గత జన్మలు చూసుకోవటం మాష్టర్ల సందేశాలు తెలుసుకోవడం లాంటివి కూడా జరగవచ్చు. కానీ ధ్యాన సాధన చేసేది వాటి కోసం కానే కాదు. 'ఆత్మజ్ఞానం' కోసం మాత్రమే. ఎందుచేతనంటే 'ఆత్మజ్ఞానం' అన్నది ఇక ఏ ఇతర సాధనల వల్లా రాదు. ఒక్క ధ్యాన సాధన వల్ల మాత్రమే వస్తుంది. అందుకే ధ్యానం అన్నిటికంటే గొప్పదని తెలుసుకోవాలి.

అందుచేత ధ్యానం అన్నది "ఆత్మజ్ఞాన సాధనే కాని ఆరోగ్య సాధన" కాదు. కారణం లోకంలో ఆరోగ్య సాధనలు ఎన్నో వేలు వున్నాయి. కానీ 'ఆత్మజ్ఞానం' కలుగ చేసే సాధన 'ధ్యానం' ఒక్కటే.

ఈ విషయాన్నే భారతదేశంలోని విపస్సనా ధ్యానకేంద్రాల వ్యవస్థాపకులైన విశ్వవిపస్సనాచార్యులు – శ్రీ సత్యనారాయణ గోయంకా గారి జీవితం నుంచి మనం తెలుసుకోవచ్చు. ఆయన తన "పార్శ్వపు మైగ్రేన్ తలనొప్పి" నయం చేసుకోవడానికి ఎన్ని దేశాలు తిరిగినా, ఎంతమంది డాక్టర్లను కలిసినా తగ్గకపోయేసరికి, "మయన్మార్"లోని ఋషి పుంగవులైన "సయాజీ ఊఖా బిన్" అనే గురువు గారి వద్దకు వెళ్ళారు.

ఆయన గోయంకా గారి అనారోగ్యం గురించి విని "కేవలం నీ జబ్బును తగ్గించుకోవటానికి ఈ విపస్సనా ధ్యానాన్ని వాడు కోవాలని'' అనుకుంటున్నావా? అని మందలించి ఈ రకంగా అన్నారు.

**"నీకు నీ రోగం కుదుర్చుకోవాలని మాత్రమే వుంటే .. ఏ ఆసుపత్రికో వెళ్ళు. 'విపస్సనా ధ్యానం' అన్నది జీవితంలో అన్ని దుఃఖాలను పోగొట్టగలిగే**

**ఒక ధర్మమార్గం! అంతేకాని అది కేవలం చిన్న చిన్న రోగాలను కుదుర్చు కోవటానికి పనికి వచ్చే చిట్కా వైద్యం ఎంత మాత్రం కాదు.**

**"అసలు నీకు వచ్చిన జబ్బు ... నీకు వున్న మొత్తం దుఃఖంలో చాలా చిన్నది. తీవ్ర ధ్యాన సాధన ద్వారా కలిగే మనో పరిశుద్ధి కార్యక్రమంలో లభించే ఉపఫలంగా (బైప్రోడక్ట్) నీ జబ్బు నయం అవుతుందే తప్ప... ఉప ఫలాన్నే నీ ప్రధాన లక్ష్యంగా చేసుకుంటే మాత్రం అది నువ్వు ధర్మం విలువను తగ్గించినట్టు అవుతుంది. నువ్వు విపస్సన ధ్యాన శిబిరానికి రా! కానీ జబ్బు నయం చేసుకునే ఉద్దేశ్యంతో మాత్రం రాకు... నీ మనస్సును విముక్తం చేసుకోవడం కోసం రా! అంటూ స్పష్టంగా చెప్పారు".**

పై సందేశాన్ని బట్టి అద్భుతమైన ధ్యాన సాధన అల్పమైన, స్వల్పమైన లాభాల కోసం చెయ్యడం, ఉపయోగించుకోవడం, బోధించడం అన్నది నిజంగా తెలివి తక్కువ తనమే అవుతుంది. ఎందుచేతనంటే ఇదంతా 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం తెలియకపోవడం వల్లనే. అందుచేత 'ఆత్మజ్ఞానం' యొక్క గొప్పతనం గురించి మరికొన్ని విషయాలు తెలుసుకుందాం.



ధ్యానం ఏదో ఒక రోగం నయం చేసుకోవటానికి కాదు
మొత్తం జీవితాన్ని నయం చేసుకోవటానికి
– సత్యనారాయణ గోయెంకా

# ఆత్మజ్ఞానం వల్ల ఎలాంటి లాభాలు పొందుతాం?

సహజంగా మానవులు రెండు కోరుకుంటారు. (1) ఉన్న కష్టాలు పోవాలని, (2) అటువంటి కష్టాలు మరల భవిష్యత్తులో రాకూడదని.

మనం గమనిస్తే ఎవరైనా ఏ గుడికి వెళ్ళినా, ఏ ప్రార్థనా మందిరానికి వెళ్ళినా, భగవంతుణ్ణి ముందు వున్న కష్టాలు పోవాలని ప్రార్థిస్తారు. ఒకవేళ ఎవరికైనా ఏ కష్టాలు లేకపోయినా గుడికి, చర్చికి వెళ్తూనే వుంటారు. ప్రార్థిస్తూనే వుంటారు. ఏమని?... భవిష్యత్తులో కష్టాలు రాకూడదని. అందుచేత మానవుల కోరికలు ముఖ్యంగా ఈ రెండే కనిపిస్తాయి.

కానీ లోకంలో గమనిస్తే మానవులు అనుకున్నట్లు జరగట్లేదు. వారు ఎన్ని పూజలు చేసినా, ఎంత ప్రార్థించినా కష్టాలు రాకుండా వుండట్లేదు. ఒకవేళ ఏదైనా కష్టం వచ్చినా అంత తేలికగా పోవట్లేదు. గమనిస్తే మానవులను ఎక్కువగా భాధించే కష్టాలలో రోగం ఒకటి. చూస్తే కొన్ని రోగాలు జీవితాంతం బాధిస్తూనే వుంటాయి. వాటిని దీర్ఘకాలిక రోగాలు అని కూడా అంటారు. రోగాలతో పాటు మానవునకు ఆర్థిక ఇబ్బందులూ వుంటాయి, కుటుంబ సమస్యలు వుంటాయి, సమాజంలో ఇతరుల వల్ల కూడా సమస్యలు వస్తూ వుంటాయి. అలాగే వార్ధక్య బాధలు... ఇలా అనేక సమస్యల వల్ల మానవులు కష్టాల పాలవుతున్నారు. ఒక రకంగా చూస్తే కష్టాలు లేని వారే వుండరు. ఒక్కొక్కరికి ఒక్కో రకం కష్టం.

ఈ కష్టాలను అనుభవించడం ఎవరికైనా కష్టమే, భరించడం కూడా భాధాకరమే. అందుచేత ఎవరైనా కష్టాల నుంచి బయటపడటానికి ప్రయత్నిస్తారు. ఇది సహజం కూడా. ప్రపంచంలో ఇన్ని కోట్ల మంది కష్టాలతో, సమస్యలతో వున్నపుడు సహజంగానే వీరి కష్టాల నుంచి బయటపడే మార్గాలు చూపించేవారు, పరిష్కారాలు సూచించేవారు, నివారణా మార్గాలు భోధించే వారు తప్పనిసరిగా వుంటారు. అలా లోకంలో గమనిస్తే మానవుల సమస్యల నుంచి బయటపడ వేసే మార్గాలు, సాధనలు మనకు ఎన్నో కనిపిస్తాయి. వాటితో పాటు ఎంతోమంది గురువులు, పండితులు, పీఠాధిపతులు, మఠాధిపతులు, మత పెద్దలు, మేధావులు మనకు కనిపిస్తారు.

అలా రోగాలు తగ్గించడానికే మనకు ఎన్నో వందల రకాల మార్గాలు కనిపిస్తాయి. వీటితో పాటు జ్యోతిష్కులు, వాస్తు పండితులు, సంఖ్యా శాస్త్రం, నామశాస్త్రం అంటూ బోధించేవారు, రుద్రాక్షలు, రత్నాలు, తాయెత్తులని, ధనలక్ష్మీ కుబేర యంత్రాలని, శని రక్షా కవచాలని, జాతకాలని ఎన్నో రకాల మార్గాలు మనకు కనిపిస్తున్నాయి. వీటితో పాటు స్వామీజీలు, బాబాలు, సాధువులు, గురువులు కోకొల్లలుగా వున్నారు. అలాగే రకరకాల మత పెద్దలు, రకరకాల ఆరాధనా మార్గాలు, పరిష్కార మార్గాలు బోధిస్తున్నారు. కానీ గమనిస్తే ఎన్ని రకాల మార్గాలు వున్నా సమస్యలు సమస్యలుగానే వుంటున్నాయి. కష్టాలు కష్టాలులాగే వున్నాయి. ఎంతమంది ఎన్ని రకాలుగా ప్రయత్నించినా ఈ కష్టాలు, రోగాలు పెరుగుతూనే వున్నాయి కానీ తగ్గటం లేదు. ఒకవేళ తగ్గినట్టు కనిపించినా మరల ఇంకో రకం కష్టంలో చిక్కుకుంటున్నారు. ఒకరకంగా మనం లోకంలో గమనిస్తే సమస్యలు లేని వారే కనిపించరు. ప్రతీ ఒక్కరు ఏదో ఒక సమస్యతో బాధపడుతున్నారు.

మరి దీనికంతటికీ కారణం ఏమిటి? ఇన్ని వేల మార్గాలు వున్నా, ఇన్ని వేల మంది ఇన్ని రకాల పరిష్కార మార్గాలు బోధిస్తున్నా, కష్టాలు, కష్టాలుగానే ఎందుకు వున్నాయి? మానవులు సమస్యల నుంచి, కష్టాల నుంచి ఎందుకు బయటపడలేకపోతున్నారు? గమనిస్తే వయస్సు పెరిగే కొద్దీ సమస్యలు పెరుగుతున్నాయి కానీ తగ్గడం లేదు. మరీ వృద్ధాప్యం వచ్చే సరికి భరించలేని కష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది. మరి ఎందుకు ఇలా జరుగుతుంది? ఇన్ని వేల మార్గాలు వున్నా, ఇన్ని వేల మంది పరిష్కారాలు సూచిస్తున్నా కష్టాలు లేకుండా ఎందుకు వుండటం లేదు? కష్టాలు రాకుండా ఎందుకు వుండటం లేదు? ఏ మార్గాన్ని, ఏ మతాన్ని అనుసరిస్తున్న వారి పరిస్థితి చూసినా ఇలాగే వుండటానికి కారణం ఏమిటి?

ఆలోచిస్తే ఇవేవి పరిష్కార మార్గాలు కావని అర్థమవుతుంది. ఎందుచేతనంటే వీటిలో ఏ ఒక్కటి పరిష్కార మార్గమైనా ఆ మార్గంలో వున్న వారైనా కష్టాలు, సమస్యలు లేకుండా వుండేవారు. కానీ లోకంలో అలా కనిపించడమే లేదు.

ఎందుచేతనంటే ఒకవేళ ఎవరైనా నాకు ఫలానా మార్గంలో తగ్గిందని, సమస్య పోయిందని చెప్పినా మరల కొంతకాలానికి వారు మరొక సమస్యలో

చిక్కుకుంటున్నారు. మరల అదే గురువు దగ్గరకు పరుగులు పెడుతున్నారు. ఇదీ ప్రస్తుతం లోకంలోని పరిస్థితి. ఆలోచిస్తే ఇది ఆశ్చర్యం కలిగించక మానదు. ఇలాంటి పరిస్థితుల్లో మనకు అనిపించవచ్చు... మరి మానవులు కష్టాలను అధిగమించలేరా? కష్టాలు లేకుండా జీవించలేరా? కష్టాలను తొలగించుకునే మార్గం లేదా? ఇక మానవుల పరిస్థితి ఇంతేనా? అని అనిపిస్తుంది. కానీ మార్గం లేదా? అంటే వుంది. ఖచ్చితంగా వుంది.

ఏది? అంటే ముందు మనం ఒక విషయం ఆలోచించాలి. ఒక విషయం గురించి అవగాహన చేసుకోవాలి. ఎందుచేతనంటే ప్రతీ ఒక్కరూ ఏమంటారంటే! మా మార్గంలోకి వచ్చినట్లయితే మీ కష్టాలన్నీ పోతాయి. మా మార్గమే గొప్పది. మమ్మల్ని ఆశ్రయించండి చాలు మీ సమస్యలు మటుమాయమవుతాయి అని చెబుతూంటారు. అంతేకానీ అసలు కష్టాలకు కారణం ఏమిటి? కష్టాలు ఎందుకు వస్తున్నాయి? కష్టాలు రాకుండా వుండాలంటే ఏం చెయ్యాలి? అన్న విషయం ఎవరూ ఆలోచించడం లేదు, చెప్పడం లేదు. ఎంతసేపూ వచ్చిన కష్టం పోవడం మీదే దృష్టి పెడుతున్నారు, చెపుతున్నారు. కానీ ఇది చాలా, చాలా ముఖ్యం. ఎందుచేతనంటే ఎంతకాలమైతే మనం మనకి వచ్చే కష్టాలకు కారణం తెలుసుకోమో! కష్టాలు ఎందుకు వస్తున్నాయని ఆలోచించమో! అంతకాలం మనం కష్టాల నుంచి బయటపడలేము. ఒకవేళ ఏదైనా ఒక మార్గంలో కష్టం నుంచి బయటపడినట్లు కనిపించినా మరల ఇంకొక కష్టంలో చిక్కుకుంటాము.

అందుచేత ముఖ్యంగా అసలు కష్టాలకు కారణమేమిటి? కష్టాలు ఎందుకు వస్తున్నాయి? కష్టాలు రాకుండా వుండాలంటే ఏమి చెయ్యాలి? అన్న విషయాలు తెలుసుకోవాలి. అప్పటి దాకా మనకు పరిష్కారం లభించదు. కష్టాలలో నుంచి బయటపడలేము. ఎందుచేతనంటే **"కష్టాలు పోవడం ముఖ్యం కాదు. అసలు కష్టాలు రాకుండా వుండటమే ముఖ్యం"**. అందుచేత కష్టాలకు కారణమేమిటి? కష్టాలు ఎందుకు వస్తున్నాయి? అన్నది తెలుసుకుందాం.

ఎందుచేతనంటే! ఎప్పుడయితే కష్టాలకు కారణం తెలుసుకుంటామో! అపుడు మనం కష్టాలు రాకుండా చేసుకోగలం. వచ్చిన కష్టాలు కూడా తేలికగా తొలగించుకోగలుగుతాము. అందుచేత కష్టాలకు కారణం తెలుసుకుందాం.

మరి కష్టాలు ఎందుకు వస్తున్నాయి? ఆలోచిస్తే కష్టాలకు కారణం

మనం గతంలో చేసిన 'కర్మలు'. ఎటువంటి కర్మలు? అంటే చెడు కర్మలు వాటినే 'పాప కర్మలు' అంటారు. అంటే గతంలో మనం చేసిన పాపాల వల్లే ప్రస్తుతం మనం కష్టాలు అనుభవిస్తున్నాం. అందుచేత తెలుసుకోండి **"మన పాపాలే మన కష్టాలు". అలాగే "మన పుణ్యాలే మన భోగాలు"** అని కూడా తెలుసుకోవాలి.

అంటే మన కష్టాలకు కారణం మనమే తప్ప వేరెవరూ కాదు. కానీ సహజంగా లోకంలో రకరకాలుగా భావిస్తారు. దేవుడు నన్ను ఇలా కష్టపెడుతున్నాడని కొందరు, భగవంతుడు నా రాత ఇలా రాసాడని కొందరు? నా ప్రారబ్ధం ఇలా వుందని కొందరు అంటారు, అనుకుంటారు. కానీ ఎవరి కష్టాలకైనా కారణం వారు గతంలో చేసుకున్న కర్మలే, పనులే తప్ప వేరే కారణం ఏదీ లేదు. ముఖ్యంగా ప్రతీ ఒక్కరూ ఇది అర్థం చేసుకోవాలి. ఇది అర్థం చేసుకోకపోతే ఎవరికైనా కష్టాలు తప్పవు.

ఈ విషయాన్నే యోగవాశిష్టంలో వశిష్ఠుల వారు చెప్పడం జరిగింది. ఆయన ఏమన్నారంటే

**శ్లో॥ యథా సంయతతే యేన తథా తేనానుభూయతే**
**స్వకర్మైవేతి చాస్తేన్యా వ్యతిరిక్తా న దైవదృక్**

తా:- ఎవడెలా ప్రయత్నిస్తాడో! అతడు దాని ఫలాన్ని అలానే అనుభవిస్తాడు. పూర్వజన్మ కృత సకర్మే 'దైవ' మనీ, 'ప్రారబ్ధ'మనీ చెప్పబడుతోంది. కనుక, తాను చేసుకున్న కర్మకంటే వేరుగా 'దైవం' గానీ, 'ప్రారబ్ధం' గానీ ఏదీ లేదు.

ఏది ఏమైనా భగవంతుని సృష్టిలో ఎవరు ఏది చేసినా దాని ఫలితం తప్పనిసరిగా అనుభవించి తీరవలసిందే! అది మంచైనా, లేక చెడైనా. ఇది సృష్టిలో వున్న గొప్ప సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్నే 'కర్మ సిద్ధాంతం' అని కూడా అంటారు. ఈ 'కర్మ సిద్ధాంతం' గురించే అనేక మంది యోగులు, మహాత్ములు, పెద్దలు కూడా చెప్పడం జరిగింది.

వారంతా 'కర్మ సిద్ధాంతం' గురించి ఏమి చెప్పారో చూద్దాం.

# కర్మ సిద్ధాంతం

## శ్రీ కృష్ణుడు



"ఎవరు ఏ కర్మ చేసుకుంటే వారు ఆ కర్మ ఫలాన్నే అనుభవిస్తారు".

## గౌతమబుద్ధుడు



"పాపం చేసేటపుడు ఎవరికైనా సుఖ భ్రాంతి వుంటుంది, కాని ఆ పాప ఫలితం అనుభవించేటపుడు మాత్రం జీవితం కడు దుర్భరంగా వుంటుంది".

## జీసస్ క్రైస్ట్



"ఏది విత్తుతావో ఆ పంటే కోసుకుంటావు".

(అంటే ఎలాంటి కర్మలు చేస్తావో అలాంటి ఫలితం అనుభవిస్తావు)



## మహమ్మద్ ప్రవక్త

"రేపటి కోసం (వచ్చే జన్మ) నేడు పంట పండించే పొలమే ఈ లోకం" అన్నారు.



## బ్రహ్మర్షి వశిష్ఠులు

ఎవడెలా చేసుకుంటాడో! అతడు దాని ఫలాన్ని అలాగే అనుభవిస్తాడు.

## శ్రీ రామకృష్ణ పరమహంస



"మనం ఏ కర్మ చేస్తే ఆ ఫలితం అనుభవించి తీరాలి" అని అంటూ కారం తింటే నోరు మండుతుంది. పంచదార తింటే నోరు మధురంగా వుంటుంది కదా? అని చెప్పారు.

## గురునానక్



"ఎంత చేశానో అంతే అనుభవించాను. మరొకర్ని ఏమో అనుకుని ప్రయోజనం లేదు" అన్నారు.

## రాధా స్వామి



"ఏ ఏ కర్మలు చేస్తావో ఆయా అనుభవాలు పొందవలసి వుంటుంది".

## కబీర్



"ఎవరు చేసిన కర్మలు వారే అనుభవిస్తారు". అని అంటూ "ఏ చేయి కర్మలనాచరిస్తుందో, ఆ చేయే ఫలితాలను అనుభవిస్తుంది." అని చెప్పారు.

## గురు సాహెబ్



1)"కర్మ సిద్ధాంతం ప్రకృతి యొక్క మారని శాశ్వత చట్టం. ఇది వ్యక్తి గత మరియు ఆధ్యాత్మిక జీవితానికి పునాది".

2) "రాత్రింబవళ్ళు మానవుడు చేసేదంతా వాని నొ సట వ్రాయబడుతుంది".

## మహాజ్ఞాని సహజోబాయి

"పశు, పక్షి, నర, సురు, అసుర, జలచర, కీటకాదులన్నీ చేసుకున్న కర్మలు అనుభవిస్తున్నవే".

## భాయి గురుదాస్‌జీ



"మంచి చేస్తే చెడు లభించదు, చెడు చేస్తే మంచి లభించదు".

## గురు రవిదాస్



"తాను చేసిన కర్మలకు ఎపుడో ఒకప్పుడు ఫలితాలు అనుభవించక తప్పదనే విషయాన్ని మానవుడు ఎప్పుడూ మరువకూడదు"



## తులసీదాసు

"ఈ ప్రపంచంలో కర్మ సిద్ధాంతానికే రాచరికం" అన్నారు.

## బ్రహ్మర్షి పత్రీజీ



ప్రస్తుతం బ్రహ్మర్షి పత్రీజీ కూడా ఈ "కర్మ సిద్ధాంతం" గురించి చాలా గట్టిగా చెబుతు న్నారు. ఆయన ఏమి చెప్పారంటే "ఎవరి కర్మను వారే అనుభవించాలి. మన చెడ్డే మనకు చెడు చేస్తుంది, మన మంచే మనకు మంచి చేస్తుంది" అని చెపుతూ ఆయన "మనం చేసే ఏ రకమైన కర్మకైనా సమయ సందర్భానుసారంగా ఆ కర్మకు తగిన ప్రతిఫలానికి కచ్చితంగా దారితీస్తుంది".

అలాగే ''విత్తుబట్టి చెట్టు వుంటుంది ... కర్మ బట్టి ఫలితముంటుంది..." అని కర్మసిద్ధాంతం గురించి సందేశం ఇచ్చారు.

అలాగే "పెద్ద పెద్ద పాపాలు చేస్తే, పెద్ద పెద్ద రోగాలు, చిన్న చిన్న పాపాలు చేస్తే, చిన్న చిన్న రోగాలు, రక రకాల పాపాలు చేస్తే, రక రకాల రోగాలు" అని కూడా చెప్పడం జరిగింది.

అంతేకాదు ఆయన "మాంసాహారం పాపాహారం, అదే అన్ని అనర్ధాలకు మూలం అందుచేత మాంసాహారం మానండి, శాకాహారం తీసుకోండి" అని చాలా గట్టిగా చెపుతున్నారు.

అలా పత్రీజీ అనేక సందర్భాలలో 'కర్మ సిద్ధాంతం' గురించి 'కర్మల' గురించి ప్రస్తావించారు. అందుచేత కర్మ సిద్ధాంతం లేదని అనుకోకండి.

అందుచేత మనం గతంలో పాపాలు చేయడం వల్ల వచ్చిన కష్టాలు

ఎలా పోతాయి? అసలు కష్టాలు రాకుండా వుండాలంటే ఏమి చెయ్యాలి? అన్న విషయాలు తెలుసుకుందాం.

ఆలోచిస్తే ఇది మనం తేలికగా అర్థం చేసుకోవచ్చు. ఎందుచేతనంటే పాపాలు చేయడం వల్ల కష్టాలు వస్తున్నపుడు కష్టాలు రాకుండా వుండాలంటే పాపాలు చేయకూడదని మనకు అర్థమవుతుంది. అంటే **"ఎవరైతే పాపాలు చేయరో వారికి కష్టాలు రమ్మన్నా రావు. అంతేకాదు ఎవరైతే పాపాలు చేస్తారో వారు వద్దన్నా కష్టాలు వచ్చే తీరతాయి".**

అందుచేత భవిష్యత్తులో ఎవరైనా కష్టాలు రాకూడదనుకుంటే ప్రస్తుతం అంటే కనీసం ఇప్పటి నుంచైనా పాపాలు చేయకూడదు. అలా ఎవరయితే పాపాలు చెయ్యరో వారికి కష్టాలు రానే రావు. అందుచేత కష్టాలు అనుభవించలేనివారు, బాధలు భరించలేనివారు, పాపాలు చెయ్యకుండా జాగ్రత్త పడాలి. పాపాలు చెయ్యకూడదు.

ఎందుచేతనంటే పాపాలు చేసి కష్టాలు, రోగాలు తెచ్చుకుని వాటిని పోగొట్టు కోవడం కోసం రకరకాల ప్రయత్నాలు, పూజలు, ప్రార్థనలు, ఆరాధనలు చేసే బదులు అసలు పాపాలే చేయకుండా వుంటే కష్టాలే రావు కదా? పోవడానికి రకరకాల ప్రయత్నాలు చేయవలసిన అవసరం వుండదు కదా? బాధ అనుభవించవలసిన అవసరం వుండదు కదా? ధనం ఖర్చు పెట్టవలసిన అవసరం కూడా రాదు కదా? అందుచేత కష్టాలు పోవడం మీద దృష్టి పెట్టడం కాదు. 'పాపాలు' చెయ్యకుండా వుండడం మీద దృష్టి పెట్టాలి.

ఇక్కడ కొన్ని విషయాలు తెలుసుకోవాలి. అసలు పాపం అంటే ఏమిటి? వేటిని పాపాలు అంటారు? పాపాలు చెయ్యకుండా వుండాలంటే ఏం చెయ్యాలి? లాంటి విషయాలు తెలుసుకోవాలి.

పాపమంటే మన వల్ల ఎవరికి అంటే ఏ మానవునికైనా, ఏ జంతువు కైనా, ఏ ప్రాణికైనా... హింస, కష్టం, నష్టం, బాధ కలిగినా అది పాపమే అవుతుంది. అంతేకాదు మనం చేసే అధర్మయుక్తమైన పనులు కూడా పాపాలే. అందుచేత కష్టాలు రాకూడదనుకునేవారు ఎవరికీ కష్టం, నష్టం, బాధ కలిగించ కూడదు, ఎవరిని హింసించకూడదు. ఎవరి హింసకు కారణం కాకూడదు. ధర్మంగా వ్యవహరించాలి. అలా జీవించిన వారికి భవిష్యత్తులో కష్టాలు రమ్మన్నా రావు. అలా జీవించాలంటే, అంటే పాపాలు చెయ్యకుండా ఉండాలంటే

ధర్మంగా వ్యవహరించాలంటే అంత తేలికైన విషయం కాదు. అటువంటి స్థితి ఎవరికైనా 'ఆత్మజ్ఞానం' వుంటేనే వస్తుంది. 'ఆత్మజ్ఞాని'కే అది సాధ్యమవుతుంది.

అందుచేత కష్టాలు రాకూడదనుకునేవారు, పాపాలు చేయకూడదను కునేవారు తప్పనిసరిగా 'ఆత్మజ్ఞానం' పొందే ప్రయత్నం చెయ్యాలి. అంటే 'ధ్యానం' చెయ్యాలి. అలా ధ్యానం చేసిన వారు 'ఆత్మజ్ఞానం' పొంది ధర్మయుక్తం గా జీవించడమే కాదు. పాపాలు చెయ్యరు. కష్టాలు రాకుండా చేసుకోగలు గుతారు. దీనిని బట్టి కష్టాలు రాకూడదంటే 'ఆత్మ జ్ఞానం' తప్పనిసరి అని అర్థమవుతుంది.

సరే ప్రస్తుతం మనం తెలుసుకున్నాం కాబట్టి ఇక్కడి నుంచి పాపాలు చెయ్యం, జాగ్రత్తగా వుంటాం. కానీ ఇప్పటి దాకా ఎన్నో పాపాలు చేసేసాం కదా? మరి వాటి ఫలితం కష్టాల రూపంలో వస్తాయి కదా? మరి ఆ కష్టాలు రాకూడదంటే ఎలా? అలాగే కొంతమందికి కష్టాలు వచ్చే వున్నాయి. మరి ఆ కష్టాల నుంచి బయటపడాలంటే ఎలా? అన్న విషయాలు తెలుసుకోవాలి.

గతంలో చేసిన పాపాల వల్ల వచ్చిన కష్టాలు కానీ, వచ్చే కష్టాలు కానీ పోవాలంటే రెండే మార్గాలు (1) అనుభవిస్తే పోతాయి, (2) పాపాలు పోతే అంటే రహితం చేసుకుంటే పోతాయి. ఇంతకు తప్ప వేరే మార్గం లేదు.

అనుభవిస్తే పోతాయి అన్న విషయం మనం గమనిస్తే స్పష్టంగా అర్థమవుతుంది. ఎవరికైనా గతంలో చేసిన పాపం వల్ల ఏదైనా ఒక రోగం కానీ, కష్టం కానీ సమస్య కానీ, ఇబ్బంది కానీ వచ్చిందనుకుందాం. అది వారు చేసిన పాపాన్ని బట్టి 6 మాసాలు అనుభవించవలసి వచ్చిందనుకుందాం. సహజంగా అటువంటి వారు రకరకాల ప్రయత్నాలు చేస్తారు. ముందుగా ఒక డాక్టరును ఆశ్రయిస్తారు. తగ్గకపోతే మరో డాక్టరు, ఇంకా తగ్గకపోతే ఇంకొక వైద్య విధానాన్ని ఆశ్రయిస్తారు. ఇలా చేస్తూంటే మెల్లిగా అతను అనుభవించవలసిన 6 మాసాల బాధ, హింస, నరకం పూర్తయిపోతాయి. అలా పూర్తి కాగానే వారు ఏ డాక్టరు దగ్గర వున్నా, ఏ వైద్య విధానంలో వున్నా, ఏ గురువును ఆశ్రయించినా, ఏ దేవుడిని ఆశ్రయించినా, ఏ మతంలో ప్రవేశించినా ఆ కష్టం, ఆ బాధ, ఆ రోగం ఆటోమేటిక్‌గా తగ్గిపోతుంది. అక్కడ ఫలానా విధానం, ఫలానా గురువు, ఫలానా మార్గం, ఫలానా మతం

అన్న ప్రసక్తి వుండదు. వారి పాప కర్మ తీరే సమయానికి ఏ మార్గంలో వున్నా వారు తమ కష్టం నుంచి ఆటోమేటిక్‌గా బయటపడతారు.

అలా తగ్గగానే సహజంగానే వారు ఆ డాక్టరు గొప్పతనమనుకుంటారు. ఆ గురువు గొప్పతనమనుకుంటారు. లేకపోతే ఆ దేవుని మహత్యం అనుకుంటారు. ఆ మతం మారడం వల్ల జరిగిందనుకుంటారు. ఆ బాబా అనుగ్రహమనుకుంటారు. అప్పటి నుంచి వారికి ఆ డాక్టరు మీద, ఆ గురువు మీద, ఆ దేవుని మీద, ఆ మతం మీద విపరీతమైన నమ్మకం, గురి ఏర్పడుతుంది. ఎందుచేతనంటే ఇది ప్రత్యక్షంగా కనబడింది కాబట్టి. కాని తగ్గటానికి అసలు కారణం, వారు అనుభవించవలసిన పాప ఫలితం పూర్తిగా అనుభవిండమే. ఎన్నాళ్ళు అనుభవించాలో అన్నాళ్ళు అనుభవించారు. ఇది పరోక్ష కారణం. కనబడని కారణం, తెలియని కారణం.

ఈ విషయం గురించి మనం కొంచెం తెలుసుకోవలసి వుంది. ఎందుచేతనంటే భగవంతుని సృష్టిలో జరిగే విషయాలు, సంఘటనలు, మార్పులు, వైపరీత్యాలు మానవులకు అర్థం కావు. ఒక్కొక్కసారి చాలా అయోమయంగా అర్థం కాని విధంగా వుంటాయి. మానవుని వూహకు కూడా అందవు. అలా ఎందుకు జరిగిందో! ఎలా జరిగిందో! కూడా తెలియదు. ఆ సంఘటనలు ఆశ్చర్యం కూడా కలిగిస్తూ వుంటాయి.

ఎందుచేతనంటే సృష్టిలో మానవుల జీవితంలో జరిగే వాటిని 'విధి' నిర్ణయమంటారు. 'విధి' వ్రాత అంటారు. అంతేకాదు 'విధి' వ్రాతను అంటే నిర్ణయాన్ని ఎవరూ తప్పించలేరు అంటారు. ఇక్కడ 'విధి' అంటే ఎవరో కాదు సాక్షాత్తూ 'భగవంతుడే'. 'భగవంతుడు' అంటే ఎవరో కాదు. ఈ సృష్టిని సృష్టి చేసిన, నడిపిస్తున్న, కంటికి కనిపించని, మానవ ఇంద్రియాలకు అంతుబట్టని అపారమైన, అనంతమైన 'శక్తి'.

ఆ శక్తినే కొందరు 'అల్లా' అంటారు. కొందరు 'తండ్రి' అంటారు. కొందరు భగవంతుడు, పరమాత్మ, పరమేశ్వరుడు, పరాశక్తి, ఆదిశక్తి అని రకరకాల పేర్లతో పిలుస్తూ వుంటారు. ఎవరు ఏ పేరుతో పిలిచినా, 'భగవంతుడు' అంటే కనిపించని 'అనంతమైనశక్తి' అని తెలుసుకోవాలి.

అటువంటి 'శక్తి' అంటే 'భగవంతుడు' చేసే నిర్ణయాలు ఎవరికి తెలుస్తాయి? ఎవరికి అర్థమవుతాయి? ఖచ్చితంగా అర్థం కావు. సామాన్య

మానవులకు అసలే అర్థం కావు. కారణం కనబడని 'విధి' నిర్ణయాలు, కారణాలు కనబడే సామాన్య మానవులకు ఎలా తెలుస్తాయి? తెలియవు గాక తెలియవు. అందుకే సామాన్య మానవులు కేవలం కనబడే కారణాలే చెబుతారు. అదే కారణమనుకుంటారు. దానినే నమ్ముతారు, దానినే విశ్వసిస్తారు.

చిన్న ఉదాహరణ చూద్దాం. ఒకతాటి చెట్టుకు తాటికాయలతో కొన్ని గెలలు కాసాయి. అందులో ఒక గెలలో ఒక కాయ పూర్తిగా పండిపోయింది (ముగ్గిపోయింది). అది రాలిపోవడానికి సిద్ధంగా వుంది. సరిగ్గా అదే సమయానికి ఒక కాకి ఆ గెల మీద వాలింది. ఆ కాకి వాలగానే ఆ తాటి పండు రాలిపోయింది. ఈ దృశ్యాన్ని అక్కడే వున్న ఒకతను చూసాడు.

వెంటనే అతడు 'కాకి వాలింది, పండు రాలింది' అని అన్నాడు. అంతేకాదు ఈ విషయాన్ని అందరికీ చెప్పాడు కూడా. చాలా ఆశ్చర్యంగా చెప్పాడు.

కానీ ఇక్కడ గమనిస్తే పండు రాలటానికి రెండు కారణాలు కనిపిస్తాయి. (1) కాకి వాలడమన్నది కంటికి కనిపించే ప్రత్యక్ష కారణం, (2) పండు పండి రాలడానికి సిద్ధంగా వుండడమన్నది పరోక్ష కారణం.

ఇక్కడ వాడి కంటికి కనిపించింది కాకి వాలడం. అందుకే వాడు "కాకి వాలింది పండు రాలింది" అనుకున్నాడు. అదే అందరికీ చెప్పాడు వాడు అంతకన్నా ఆలోచించలేదు.

కానీ పండు రాలటానికి అసలు కారణం కాకి వాలడం కాదు. పండు పండడం, రాలటానికి సిద్ధంగా వుండటమే. ఇది పరోక్ష కారణం. కనబడని కారణం. ఎందుచేతనంటే కాకి వాలితేనే పండు రాలేటట్లయితే ఆ గెలలో వున్న మిగిలినవి కూడా రాలాలి కదా? మరి ఎందుకు రాలలేదు? అంటే అవి ఇంకా పూర్తిగా పండలేదు కాబట్టి. కానీ వాడు దీని గురించి ఆలోచించ లేదు.

దీనిని బట్టి మనకు అర్థమయ్యేదేమిటంటే పరోక్ష కారణమే అసలు కారణం. కానీ ప్రత్యక్ష కారణం అంటే కనబడే కారణం కారణం కానే కాదు. అలాగే ఈ సృష్టిలో జరిగే సంఘటనల యొక్క కనబడని అసలు కారణం ఎవరికీ తెలియదు. అందుకే కనబడే కారణమే అసలు కారణమనుకుంటారు.

ఇక్కడ గమనిస్తే మానవుల కష్టాలు పోవడానికి అసలు కారణం

వారి పాపం తీరడమే, అనుభవించవలసిన కష్టాలను అనుభవించడమే. ఇది కనిపించని పరోక్ష కారణం. అంతే కానీ పాపం తీరే సమయంలో, కష్టం పోయే సమయంలో వారు ఆశ్రయించిన డాక్టరు కాదు, గురువు కాదు, జ్యోతిష్య, వాస్తు పండితులు కాదు, మత పెద్దలు కాదు, మతం కాదు, దేవుడు కాదు.

ఈ విషయం అర్థం కాక సామాన్యులు ఆ సమయంలో వారు ఆశ్రయించిన వారి మహత్యమనుకుంటూ జీవితాంతం వారినే నమ్ముతుంటారు. వారినే అనుసరిస్తూ వుంటారు.

కారణం సామాన్య జనులు "ప్రత్యక్ష కారణాన్నే నమ్ముతారు కానీ పరోక్ష కారణం గురించి ఆలోచించరు".

ఈ విషయం గురించి మనం ఇంకా ఆలోచించగలిగితే ఇది అర్థమవుతుంది. ఎందుచేతనంటే ఒకరి వల్ల ఆ కష్టం పోయింది అంటారు. కానీ వారికి మరల కష్టం రాకుండా వుందా? అంటే వుండదు. మరల ఇంకొక కష్టం వస్తుంది. మరి తాము ఆశ్రయించిన వారు గొప్పవారైతే ఈ కష్టం ఎందుకు వచ్చింది? వారు ఈ కష్టం రాకుండా ఎందుకు చెయ్యలేకపోయారు? వారు గొప్పవారే కదా?

కానీ ఈ విషయం ఎవరూ ఆలోచించరు. ఆయన వచ్చింది పోగొట్టగలిగారు కాబట్టి మరల వచ్చింది కూడా ఆయనే పోగొడతాడని ఆయననే ఆశ్రయిస్తారు. ఆయననే నమ్ముకుంటారు. అంతేకానీ మరల కష్టం ఎందుకు వచ్చింది? అసలు ఆయన కష్టం రాకుండా ఎందుకు చేయలేడు? అని ఆలోచించరు. ఆలోచిస్తే తాను అనుభవించవలసినదంతా అనుభవించడం వల్లే కష్టంలో నుంచి బయటపడగలిగాను అన్నది అర్థమవుతుంది.

ఎందుచేతనంటే ఈ ప్రత్యక్ష, పరోక్ష కారణాల గురించి మనం గమనించగలిగితే మనం తేలికగా అర్థం చేసుకోవచ్చు. కొన్ని ఉదాహరణలు చూద్దాం.

భూకంపాలు వచ్చినపుడు కొన్ని సందర్భాలలో అన్నీ కూలిపోతాయి. కొన్ని ఆశ్చర్యంగొలిపే విధంగా చెక్కు చెదరకుండా అలాగే వుండిపోతాయి. అలాగే చాలా మంది చనిపోతారు కానీ కొంతమంది ఆ శిధిలాల క్రింద రోజుల తరబడి నీరు, ఆహారం లేకుండా బతికే వుంటారు.

కొన్ని కొన్ని యాక్సిడెంట్‌లలో కొంతమంది దారుణంగా చనిపోతారు,

కానీ కొంతమంది ఆశ్చర్యం కలిగించే విధంగా తప్పించుకుంటారు. ఏ దెబ్బలు తగలకుండా బయటపడ గలిగిన వారు కూడా వుంటారు.

ఇంకా కొంతమంది యాక్సిడెంట్లు అవుతాయేమోనని జాగ్రత్త కోసం బయటకు వెళ్ళరు, కానీ ఇంట్లో బాత్‌రూమ్‌లోనే జారిపడి ఎముకలు విరగ్గొట్టుకుంటారు. ఇలాంటి వారు ఎంతో మంది కనిపిస్తారు. చూశారా వారు ఎంత జాగ్రత్తగా వున్నా జరిగే దానిని తప్పించుకోలేకపోయారు.

కొంతమంది ఎంత కష్టపడినా కలిసి రాదు. ఏమీ సంపాదించలేరు. కానీ కొంతమంది అయాచితంగానే ఊహించనంతగా సంపాదించగలుగుతారు. కొంతమంది కోటీశ్వరులకు పుట్టి, పుట్టుకతో కోటీశ్వరులవుతారు. పేదవారికి పుట్టిన వారు పుట్టుకతోటే పేదవారవుతారు. ఇక్కడ ప్రత్యక్ష కారణం ఆ తల్లిదండ్రులకు పుట్టడం వల్ల అనుకుంటారు. కానీ పరోక్ష కారణం వేరు. అది వారు గతంలో అంటే గత జన్మలలో చేసుకున్న కర్మలను బట్టే జరిగింది. ఇది ఎవరికీ అర్థం కాదు.

అలాగే కొంతమంది పసితనంలో, కొంతమంది బాల్యంలో, కొంతమంది యవ్వనంలో, కొంతమంది వివాహం తరువాత, ఇంకా కొంతమంది వయస్సు మళ్ళిన తరువాత వూహించలేని రకరకాల కారణాలతో చనిపోతూ వుంటారు. కానీ ఇవన్నీ ప్రత్యక్ష కారణాలు. కానీ పరోక్ష కారణాలు వేరు.

ఇలా చెప్పుకుంటూ పోతే మనకు ఎన్నో వుంటాయి. ఎందుచేతనంటే కారణం మనకు సంతృప్తికరంగా వున్నపుడు అదే కారణమనుకుంటాం. కానీ కారణం మనకు సంతృప్తికరంగా లేనపుడు, అర్థం కానపుడు భగవంతుడు ఇలా చేసాడు, దేవుని దయలేదు, నా ప్రారబ్దం ఇలా వుందని రకరకాలుగా అనుకుంటాం.

కానీ ఏది ఏమైనా ప్రతీ దానికి పరోక్ష కారణం. 'విధి' నిర్ణయమే అంటే 'భగవంతుని' నిర్ణయమే. కానీ 'భగవంతుని' నిర్ణయం మటుకు ఈ సృష్టిలో ఆయన ఏర్పాటు చేసిన "కర్మ సిద్ధాంతాన్ని" బట్టి వుంటుంది. అది అందరికీ ఒకేలా వర్తిస్తుంది. కారణం ఆయనకు అందరూ సమానమే కాబట్టి. అందుచేత ఆయన ఒక్కొక్కరికి ఒక్కొక్క నిర్ణయం చెయ్యడు. పూజించిన వారికి, ప్రార్థించిన వారికి ఒక రకంగా పూజించని వారికి, ప్రార్థించని వారికి మరో

రకంగా... ఇలా రకరకాల నిర్ణయాలేమి వుండవు. ఆయన ఏర్పాటు చేసిన సిద్ధాంతాలను బట్టి, ధర్మాలను బట్టి, ఈ సృష్టి నడపబడుతుంది, నడుస్తుంది కూడా. ఇది ఆటోమేటిక్‌గా జరిగిపోతుంది. ఆయన అన్నిటికీ సాక్షీభూతంగా వుంటాడు. అందుకే ఆయనను "సాక్షీభూతుడు" అంటారు.

అందుచేత మానవ జీవితం "కర్మ సిద్ధాంతాన్ని" బట్టి ఆధారపడి వుందని తెలుసుకోండి. మానవుడు చేసే **"కర్మలను బట్టే మానవుని భవిష్యత్తు ఆధారపడి వుందని తెలుసుకోండి".** అందుకే **"చేసుకున్న వాడికి చేసుకున్నంత మహాదేవ"** అన్నారు.

ఏది ఏమైనా ఎవరు ఎంత పాపం చేస్తే అంతా అనుభవించవలసిందే. ఎక్కువ కాలం పాపం చేస్తే ఎక్కువ కాలం, తక్కువ కాలం పాపం చేస్తే తక్కువ కాలం కష్టాలు అనుభవించాల్సి వస్తుంది. అందుకే ఎక్కువ కాలం పాపం చేసిన వారు ఎక్కువ కాలం రోగాలు, బాధలు అనుభవిస్తున్నారు. తక్కువ కాలం పాపం చేసిన వారు తొందరగా బయటపడుతున్నారు. దీనికి అసలు కారణం ఇదే. అలాగే పెద్ద పాపం చేస్తే పెద్ద కష్టం అనుభవిస్తారు. చిన్న పాపం చేస్తే చిన్న కష్టం అనుభవిస్తారు. మొత్తం మీద ఎవరు ఏది చేసుకుంటే అదే అనుభవిస్తారు. అందుకే **"చేసుకున్న వాడికి చేసుకున్నంత మహాదేవ"** అన్నారు.

సరే తక్కువ పాపం చేసిన వారు తొందరగా బయటపడగలుగుతారు. కానీ ఎక్కువ పాపం చేసిన వారు అంత తేలికగా, తొందరగా బయటపడలేరు సరికదా, ఆ కష్టాన్ని, బాధను భరించడం కూడా కష్టంగానే వుంటుంది. మరి అటువంటి వారు ఆ కష్టం నుంచి తొందరగా బయటపడాలంటే ఎలా? ఆ బాధ అనుభవించకుండా వుండాలంటే ఎలా? అంటే పాపాలు చేయడం వల్ల రాబోయే కష్టం, వచ్చిన కష్టం అనుభవించకుండా బయటపడాలంటే ఎలా? ఏమైనా మార్గం వుందా? అంటే వుంది.

ఆ మార్గమే శ్రీ కృష్ణ భగవానుడు భగవద్గీతలో ఈ శ్లోకం ద్వారా బోధించడం జరిగింది.

**శ్లో॥ అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।**
**సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥(భ.గీ.4-36)**

తా:- నీవు పాపాత్ములందరి కంటే మిక్కిలి పాపాత్ముడవైనా ఆ పాప

సముద్రాన్ని జ్ఞానమనే తెప్పచే దాటివేయగలవు.

దీనిని బట్టి ఎవరు ఎన్ని పాపాలు చేసినా, సముద్రమంతటి పాపాలు చేసినా ఆ పాప సముద్రాన్ని అంటే ఆ పాపాలన్నీ 'జ్ఞానమనే' తెప్పతో అంటే 'ఆత్మజ్ఞానం'తో అధిగమించవచ్చు అని శ్రీ కృష్ణ భగవానుడు స్పష్టంగా చెప్పడం జరిగింది. దీనిని బట్టి 'ఆత్మజ్ఞానం' ఎంత అవసరమో తెలుసుకోవచ్చు.

బ్రహ్మర్షి వశిష్టుల వారు కూడా తన యోగవాశిష్టం ద్వారా ఈ సందేశాన్నే ఇవ్వడం జరిగింది.

**శ్లో॥ జ్ఞానయుక్తిప్లవేనైవ సంసారాబ్ధిం సుగుస్తరమ్**
**మహాధియః సముత్తీర్ణా నిమేషేణ రఘూద్వహా.**

తా:- ఓ రఘుకులోత్తమా ! దాటటానికి కష్టసాధ్యమైనట్టి ఈ సంసార సముద్రాన్ని వివేకవంతులైన జనులు కేవలం "జ్ఞాన యుక్తి" అనే నౌక ద్వారా ఒక్క నిమిషంలో దాటివేస్తారు.

వశిష్ఠుల వారు 'ఆత్మజ్ఞానం' ద్వారా కష్టాలను అధిగమించడమే కాదు. కష్టాలతో కూడుకుని, బయటపడటానికి వీలు లేనటువంటి సముద్రం లాంటి ఈ సంసారం నుంచి శాశ్వతంగా "ఆత్మజ్ఞాన"మనే నౌక ద్వారా దాటవచ్చు. అంటే బయటపడవచ్చు. అంటే శాశ్వతంగా కష్టాల నుంచి బయటపడవచ్చని చెప్పడం జరిగింది.

అందుచేత 'ఆత్మజ్ఞానం'తో పాపాలు రహితం చేసుకోవచ్చు తద్వారా కష్టాలు, రోగాలు అధిగమించవచ్చు. అంతేకాకుండా శాశ్వతంగా దుఃఖం నుంచి బయటపడవచ్చు అంటే ముక్తి పొందవచ్చని తెలుస్తుంది. మరి ఈ 'ఆత్మజ్ఞానం' ఎలా వస్తుంది? అంటే ధ్యానం వల్ల అని ఇంతకు ముందే తెలుసుకున్నాం. దీనిని బట్టి మనకు స్పష్టంగా అర్థమయ్యేదేమిటంటే ధ్యానం వల్ల 'ఆత్మజ్ఞానం' కలుగుతుంది. 'ఆత్మ జ్ఞానం' వల్ల పాప కర్మలు రహితం అవుతాయి. కర్మ రహితం వల్ల కష్టాలు పోతాయి. అంటే ముక్తి పొందుతారని తెలుసుకోవాలి.

అందుకే పత్రీజీ ఇలా అన్నారు.

**"ధ్యానం వల్లనే జ్ఞానం – జ్ఞానం వల్లనే ముక్తి".**

ఈ విషయాన్నే మనం మరొక కోణంలో తెలుసుకోవచ్చు.

# త్రివిధ అగ్నులు

ప్రతీ మానవుడిలో సహజంగా 3 రకాల అగ్నులు ప్రజ్వరిల్లుతూ వుంటాయి. అవి (1) జఠరాగ్ని, (2) కామాగ్ని, (3) జ్ఞానాగ్ని.

ఇక్కడ జఠరాగ్ని 'శరీరానికి' సంబంధించినది. కామాగ్ని 'మనస్సు'కు సంబంధించినది. అలాగే జ్ఞానాన్ని 'ఆత్మ'కు సంబంధించనది.

సహజంగా ప్రతీ ఒక్కరిలో ఈ జఠరాగ్ని, కామాగ్ని దహిస్తూంటాయి. మానవుడు ఈ అగ్నులను ఎంత చల్లార్చడానికి ప్రయత్నించినా, ఎంత శాంతింప చేయాలనుకున్నా మళ్ళీ మళ్ళీ ప్రజ్వరిల్లుతూనే వుంటాయి. మానవుణ్ణి దహించి వేస్తూంటాయి.

సహజంగా పుట్టగానే 'జఠరాగ్ని' దహించడం ప్రారంభిస్తుంది. ఈడు రాగానే 'కామాగ్ని' దహించడం ప్రారంభిస్తుంది. అందుకే పుట్టగానే 'కూడు' అంటే ఆహారం కోసం చూస్తారు. ఈడు రాగానే తోడు కోసం అంటే స్త్రీ పురుషుడి సాంగత్యం కోసం, పురుషుడు స్త్రీ సాంగత్యం కోసం చూస్తాడు.

కానీ ఇదంతా సృష్టిలో జరిగే, ఎవరికి అర్ధం కానీ, అంతుబట్టని విచిత్రం. ఎంత తప్పించుకుందామనుకున్నా తప్పించుకోలేని పరిస్థితి.

సృష్టిలో ఈ ఏర్పాటు చేయబడటానికి కారణం 'జఠరాగ్ని'. ప్రాణులు జీవించడం కోసం, మనుగడ సాగించడం కోసం ఏర్పాటు చేయబడింది. అలాగే 'కామాగ్ని' సృష్టిక్రమం కొనసాగడం కోసం ఏర్పాటు చేయబడింది. ఈ సృష్టి యధాతధంగా, అనంతంగా కొనసాగాలంటే! ప్రతీ జీవిలో కామాగ్ని ప్రజ్వరిల్లవలసిందే! స్త్రీ పురుష జీవుల మధ్య ఆకర్షణ కలగాల్సిందే! సంయోగం చెందాల్సిందే. పునరుత్పత్తి జరగాల్సిందే! పరిణామ క్రమం కొనసాగాల్సిందే. అలా ప్రతీ జీవి అన్ని రకాల అనుభవాలు పొందాల్సిందే. ఇది సృష్టిలో వున్నటువంటి ఏర్పాటు.

మానవులు జఠరాగ్ని చల్లార్చడానికి ప్రతీ పూట కడుపులో ఆహారం వేస్తూనే వుంటారు. కానీ ఎంతవేసినా, ఎన్నిసార్లు వేసినా జఠరాగ్ని మరల మరల ప్రజ్వరిల్లుతూనే వుంటుంది. దహించి వేస్తూంటుంది.

అలాగే శరీరంలో రగిలే కామాగ్నిని చల్లార్చడానికి ప్రతీ రోజూ పురుషుడు స్త్రీతోను, స్త్రీ పురుషునితోను సంభోగిస్తూనే వుంటారు. అలా

ఎన్నిసార్లు సంభోగించినా, కామాగ్ని మళ్ళీ మళ్ళీ ప్రజ్వరిల్లుతూనే వుంటుంది.

మానవులు ఈ అగ్నులను చల్లార్చడం కోసం ప్రయత్నిస్తూ రకరకాల తప్పులు చేస్తున్నారు. పాపాలు చేస్తున్నారు, చేయకూడని పనులు చేస్తున్నారు. ధర్మవిరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. సృష్టి విరుద్ధంగా జీవిస్తున్నారు. అలా పాప కర్మలు చేస్తూ కష్టాలలో చిక్కుకుంటున్నారు. జీవితంలో నరకాన్ని అనుభవిస్తున్నారు. అలా ఎన్నో జన్మలు పాపాలు చేసి నరకాన్ని అనుభవించి తరువాత ఆలోచిస్తారు. ఏమిటి ఈ జీవితం? ఎందుకీ జీవితం? అని అనుకుంటారు. ఇటువంటి జీవితం లేకుండా వుంటే బాగుండును, భగవంతుడు నన్ను సృష్టించడం దేనికి? ఇలా కష్టాలు పెట్టడం దేనికి? అని బాధపడుతూ వుంటారు. ఇదంతా ఎందుకు జరుగుతుందో అర్థం కాదు. అసలు జీవితమే వద్దనుకున్నా కుదరదు. అంతా అయోమయం.

మానవునిలో ఈ 'జఠరాగ్ని' 'కామాగ్ని' చల్లార్చుకోగలిగిన, తీర్చుకోగలిగిన అవకాశం వున్నప్పుడు అతడు 'స్వర్గాన్ని' చూస్తాడు. కానీ వాటిని చల్లార్చుకోలేని సందర్భాలు, జన్మలు కలిగినపుడు 'నరకాన్ని' అనుభవిస్తాడు. దుఃఖ పడతాడు. పేదరికం వల్ల జఠరాగ్నిని చల్లార్చలేరు. భాగస్వామితో వియోగం వల్ల కామాగ్నిని చల్లార్చలేరు.

గమనిస్తే కొందరి జీవితాలలో స్వర్గం కనిపిస్తుంది. అపుడు ఆహా ఏమి నా అదృష్టం అని పొంగిపోతారు. కానీ కొందరి జీవితాలలో నరకం కూడా కనిపిస్తుంది. అపుడు ఎందుకీ జీవితం? నేను ఎంత దురదృష్టవంతుణ్ణి? అని కుంగిపోతారు. అటువంటి దుఃఖం నుంచి ఎలా బయటపడాలి అని ఆలోచిస్తూ వుంటారు.

అప్పుడు గురువులను, పెద్దలను ఆశ్రయించి రకరకాల సాధనలు చేస్తూ చివరకు ఏమి తెలుసుకుంటారంటే ఈ జఠరాగ్ని, కామాగ్ని బాధించకుండా వుండాలంటే తనంత తానుగాన తన ప్రయత్నంలో 'జ్ఞానాగ్ని'ని ప్రజ్వరిల్ల చేసుకోవాలని తెలుస్తుంది. దానికి 'శ్వాస మీద ధ్యాస' వుంచి ధ్యానం చెయ్యాలని తెలుస్తుంది. అలా ధ్యాన మార్గంలోకి వస్తారు. ధ్యానం చేస్తారు. అలా ధ్యానం చెయ్యడం ప్రారంభం కాగానే వారిలో వారికి తెలియకుండానే 'జ్ఞానాగ్ని' ప్రజ్వరిల్లడం ప్రారంభిస్తుంది. ఈ 'జ్ఞానాగ్ని' ప్రజ్వరిల్లే కొద్దీ వారికి చాలా విషయాలు తెలుస్తూ వుంటాయి. ఈ కష్టాలకి కారణం ఈ జఠరాగ్ని,

కామాగ్ని అని బాగా తెలుసుకుంటారు. అపుడు వాటికి ప్రాముఖ్యం ఇవ్వరు. వాటిని చల్లార్చటానికి తప్పులు, పాపాలు చెయ్యరు. ఏది దొరికితే అదే ఆహారంగా తీసుకోరు. మితంగా సంభోగంలో పాల్గొంటారు. ఎక్కువ సమయం ధ్యాన సాధనకు వినియోగిస్తారు.

అలా చేసే కొద్దీ వారిలో 'జ్ఞానాగ్ని' ఇంకా ఇంకా ప్రజ్వరిల్లుతూ వుంటుంది. ఈ జ్ఞానాగ్నిలో అతను అంతకు ముందు చేసిన పాపకర్మలు ఒక్కొటొక్కటిగా దగ్ధమవుతూ వుంటాయి. అందుచేత కష్టాలు తగ్గుతూ వుంటాయి. ఆనందం పెరుగుతూ వుంటుంది. దానితో ఆ రుచి చూసి ధ్యాన సాధన ఇంకా, ఇంకా తీవ్రతరం చేస్తారు. 'జ్ఞానాగ్ని'ని ఇంకా ప్రజ్వరిల్ల చేస్తారు. తన కర్మలన్నీ పూర్తిగా దగ్ధం చేసుకుంటారు. శాశ్వత ఆనందాన్ని పొందుతారు. వారికి ఇక శరీరం రాదు. అపుడు వారిలో జఠరాగ్ని, కామాగ్నులు ప్రజ్వరిల్లే ఆస్కారమే వుండదు. వాటివల్ల వారికి దుఃఖం కలగదు. దీనినే 'మోక్షం' అంటారు.

అంటే ఎవరవుతే జఠరాగ్ని, కామాగ్నుల బారి నుండి బయటపడతారో వారిని 'ముక్తి' లేక 'మోక్షం' పొందారు అంటారు.

ఇక్కడ గమనిస్తే ఈ 'జఠరాగ్ని, కామాగ్ని' మానవులను కోరికలతో దహించి వేస్తాయి. కానీ 'జ్ఞానాగ్ని' వారిని కోరికల నుండి బయటపడవేసి ఆ రెండు అగ్నుల బారి నుండి కాపాడుతుంది. దీనిని బట్టి మనకు ఏమి తెలుస్తుందంటే! మానవులకు 'జఠరాగ్ని, కామాగ్ని' నష్టం కలిగిస్తే. 'జ్ఞానాగ్ని' శాశ్వత లాభాన్ని చేకూరుస్తుంది.

అందుచేత ఆలోచిస్తే మానవులు ఈ 'జఠరాగ్నిని, కామాగ్నిని' చల్లార్చడానికి ప్రయత్నించే బదులు తమలో 'ధ్యాన సాధన' ద్వారా 'జ్ఞానాగ్నిని' ప్రజ్వరిల్ల చేసుకుంటే వాటి బారి నుండి రక్షించుకోగలుగుతారు. ఎందుచేతనంటే వాటిని ఎంత చల్లార్చినా మళ్ళీ ప్రజ్వరిల్లుతూనే వుంటాయి. ఎన్ని సార్లు చల్లార్చినా, అలా ఎన్ని జన్మలు చల్లార్చినా మరల, మరల ప్రజ్వరిల్లుతూనే వుంటాయి. మానవులను దహిస్తూనే వుంటాయి. ఒక్క 'జ్ఞానాగ్నిలోనే' అవి శమిస్తాయి. మానవులకు శాంతిని కలిగిస్తాయి.

అలా యోగులంతా ధ్యానం చేసి 'జ్ఞానాగ్ని'ని రగిలించుకుని ఈ 'జఠరాగ్నిని, కామాగ్నిని' అదుపు చేయగలిగారు. వాటి ప్రభావం లేకుండా

చేసుకోగలిగారు. ఎప్పుడూ శాంతిగా, ఆనందంగా వుండటమే కాదు. శాశ్వత ఆనందమైన 'ముక్తి'ని కూడా పొందగలిగారు. అందుచేత రకరకాల ఆహారాలు, అంటే మాంసాహారం మొదలైనవి వేసి జఠరాగ్నిని, రకరకాల స్త్రీలతో సంభోగించి కామాగ్నిని చల్లార్చడం కాదు 'ధ్యానం' ద్వారా 'జ్ఞానాగ్ని'ని ప్రజ్వరిల్ల చేసుకుని 'జఠరాగ్ని'ని, 'కామాగ్ని'ని చల్లబరచుకోవాలి. శాంతిని పొందాలి. ఆనందంగా జీవించాలి.

అందుచేత తెలుసుకోండి. ఏ రకంగా చూసినా, ఎవరికైనా 'ఆత్మజ్ఞానం' తప్పనిసరి అని అర్థమవుతుంది. మానవుడు కష్టాల నుంచి, రోగాల నుంచి తాత్కాలికంగానే కాదు శాశ్వతంగా బయటపడాలన్నా 'ఆత్మజ్ఞానమే' మార్గం అంతకన్నా దారి లేదు కాక లేదు. అందుకే యోగులంతా 'ఆత్మజ్ఞానాన్ని' బోధించడం జరిగింది.

అందుచేత తెలుసుకోండి ఊరికే ధ్యానం చేస్తే రోగాలు పోవు. వారిలో 'జ్ఞానం' ఉదయిస్తేనే వాటి నుంచి బయటపడగలుగుతారు. అందుచేత ధ్యానం చేసే వారు రోగాలు తగ్గాయా? లేదా? అని చూడటం కాదు. 'జ్ఞానం' పొందామా? లేదా? అని చూడాలి.

సూక్ష్మంగా చెప్పాలంటే! 'ఆత్మజ్ఞానం' లేనివాడు అంటే అజ్ఞానంలో వున్నవాడు చేయకూడని పనులు చేస్తాడు. కష్టాలు రోగాలు తెచ్చుకుంటాడు. వాటి నుంచి బయటపడటానికి వారు చేసే ప్రయత్నం వల్ల కొన్ని కష్టాల నుంచి బయటపడినట్లు కనిపించినా మరల, మరల కష్టాలలో చిక్కుకుంటాడు. కారణం పాపాలు చేయడం మానలేదు కనుక. ఇదంతా ఎందుకు జరుగుతుందంటే 'అజ్ఞానం' వల్లనే.

అంతేకాదు అజ్ఞానంలో వున్నవాడు చేయవలసిన పనులు చెయ్యడు. పొందవలసిన లాభాలు జీవితంలో పొందలేడు. అంటే అజ్ఞానం వల్ల రెండు రకాలుగా కూడా నష్టమే. ఒకటి పాపాలు, తప్పులు చేస్తూ కష్టాల పాలవుతాడు, నష్టపోతాడు. రెండు చేయవలసిన పనులు చేయకపోవడం వల్ల లాభాలు కూడా పొందలేడు.

కానీ ఎవరైతే ధ్యానం చేసి 'అజ్ఞానాన్ని' తొలగించుకుని 'ఆత్మజ్ఞానాన్ని' పొందుతారో వారు చేయకూడని పనులు చెయ్యక పోవడం వల్ల కష్టాలు రావు. అంతేకాదు వారు చేయవలసిన పనులే చేయడం వల్ల భవిష్యత్తులో

అంతా మంచే జరుగుతుంది. జీవితంలో లాభాలే పొందుతారు. అంటే 'ఆత్మజ్ఞాని' ఏ రకంగా చూసినా జీవితంలో లాభాన్నే పొందుతాడు. ఆలోచిస్తే మానవునకు ఇంతకన్నా కావలసింది ఏముంది?

అంతేకాదు 'ఆత్మజ్ఞాని' తన కర్మలన్నింటిని దగ్ధం చేసుకుని శాశ్వత ఆనందాన్ని కూడా పొందగలుగుతాడు. అంటే ముక్తిని పొందుతాడు అంటే మోక్షాన్ని పొందుతాడు. అసలు మానవ జీవిత లక్ష్యం ఇదే కదా?

ఈ విషయమే భగవద్గీతలో కూడా చెప్పబడింది "జ్ఞానాగ్ని దగ్ధకర్మాణాం" (భ.గీ.4-19) అంటే జ్ఞానమనే అగ్నిలోనే కర్మలన్నీ దగ్ధమవుతాయి. అంటే కర్మలన్నీ రహితమైన వారికి మరల జన్మ అన్నదే వుండదు. దానినే 'ముక్తి' అంటారు.

అందుచేత మానవ జీవిత లక్ష్యం గురించి కొంచెం తెలుసుకుందాం.

ప్రతి మానవుడు లక్ష్యంతో జీవించాలి. లక్ష్యంతో జీవించిన మానవుడు జీవితాన్ని పూర్తిగా సద్వినియోగం చేసుకున్నవాడవుతాడు. లేనివాడు ఆ జీవితాన్ని వ్యర్థం చేసుకున్నవాడవుతాడు. లక్ష్యం లేకుండా నిర్లక్ష్యంగా జీవిస్తే జీవితం వ్యర్థమవుతుంది. లక్ష్యంతో జీవిస్తే జీవితం అర్థవంతమవుతుంది.

మరి మానవుని లక్ష్యం ఏమిటి? మానవుని లక్ష్యం రెండు రకాలుగా వుంటుంది. (1)జీవితలక్ష్యం, (2)సాధనాలక్ష్యం. ఒక రకంగా రెండూ ఒకటే.

ఎవరైనా సరే జీవిత లక్ష్యాన్ని సాధించాలంటే దానికి అనుగుణమైన సాధనను ఎంచుకోవాలి. సాధన ఎంచుకున్నప్పుడు ఆ సాధన యొక్క లక్ష్యం ఏమిటి? అది జీవిత లక్ష్యాన్ని సాధించి పెడుతుందా? లేదా? అన్నది తెలుసుకోవాలి. జీవిత లక్ష్యమే సాధనా లక్ష్యం కావాలి.

మరి మానవ జీవిత లక్ష్యం ఏమిటి? అంటే మానవుడు కష్టాలనుంచి, సమస్యల నుంచి, రోగాల నుంచి శాశ్వతంగా బయటపడటం అంటే 'ముక్తి'ని పొందటం. అది ఎలా సాధ్యం? అంటే మానవుడు 'ఆత్మజ్ఞానం'. పొందినపుడు ఆ 'ఆత్మజ్ఞానం' ఎలా వస్తుంది? ఆత్మకు సంబంధించిన 'జ్ఞానం' ఆత్మను ఆశ్రయించినపుడే వస్తుంది. మరి ఆత్మను ఆశ్రయించే మార్గమేది? సాధన ఏది?

ఆత్మను ఆశ్రయించే మార్గమే "శ్వాస మీద ధ్యాస" ధ్యానం. ధ్యాన సాధన ద్వారానే ఎవరైనా ఆత్మను ఆశ్రయించగలరు. ఆత్మస్థితి పొందగలరు.

'ఆత్మజ్ఞానాన్ని' పొందగలరు. అందుచేత మానవ జీవిత లక్ష్యాన్ని సాధించి పెట్టగల సాధన 'ధ్యానమని' తెలుసుకోవాలి. అలాగే 'ధ్యాన సాధన' యొక్క లక్ష్యం కూడా 'ఆత్మజ్ఞాన'మనే తెలుసుకోవాలి.

అందుచేత ధ్యాన సాధన చేసేవారు. సాధనా లక్ష్యం మీద దృష్టి వుంచాలి. ఈ ధ్యానం దేని కోసం చేస్తున్నాము? ఏ లాభం ఆశించి చేస్తున్నాము? అన్న అవగాహన వుండాలి.

కానీ ప్రస్తుతం ఈ ధ్యాన సాధనను ఆరోగ్య సాధనగా భావిస్తున్నారు, మనశ్శాంతి పొందటానికి చేస్తున్నారు. ఇంకొందరు సమస్యలు పరిష్కారం అవుతాయని, ఇంకొందరు కోరిన కోరికలు నెరవేరతాయని చేస్తున్నారు.

ఇంకా కొంతమంది రకరకాల అనుభవాలు వస్తాయని చెప్తున్నారు. అంటే మూడవ కన్ను తెరుచుకుంటుందని, సూక్ష్మశరీరయానం చెయ్యవచ్చని, మాస్టర్సు కనబడి మెసేజ్‌లు ఇస్తూ వుంటారని, గత జన్మలు చూసుకోవచ్చని చెప్తున్నారు. కానీ ఇవేమీ జీవిత లక్ష్యం కాదు.

అందుచేత ధ్యానం రోగాల కోసం, అనుభవాల కోసం కాదని తెలుసుకోవాలి. వాటిని లక్ష్యంగా పెట్టుకుని ధ్యానం చేయడం కూడా దండగే. కారణం ఏ యోగి చేసినా, ఏ ఋషి చేసినా, ఏ మహర్షి చేసినా వారి లక్ష్యం ఒకటే. ఆ లక్ష్యం కోసమే వాళ్ళంతా ధ్యానం చేసారు, ధ్యాన మార్గంలోకి వచ్చారు. అన్నిటి కంటే ధ్యానానికి ప్రాముఖ్యం ఇచ్చారు. చివరికి లక్ష్యాన్ని సాధించారు. జీవితాన్ని, జన్మను సద్వినియోగం చేసుకున్నారు.

సహజంగా మానవుడు ఏ సమస్యలు లేకుండా వెళ్ళిపోతే చాలు అనుకుంటాడు. కానీ అలా వెళ్ళడం గొప్ప కాదు. **"వెళ్ళిన వాడు మళ్ళీ రాకుండా వుంటేనే గొప్ప".** అదే అసలైన ఆనందం. దానినే శాశ్వత ఆనందం అంటారు. జన్మ లేకుండా చేసుకోవడం అంటారు. 'నిర్వాణం' అని కూడా అంటారు. మరి భూమి మీదకు రాకూడదంటే 'ఆత్మజ్ఞానం' కలగాలి. అనుభవ పూర్వకంగా 'ఆత్మజ్ఞానం' పొందాలి. అదే మానవ జీవిత లక్ష్యం. అందుచేత ఆ లక్ష్యమే ధ్యాన సాధనా లక్ష్యం చేసుకోవాలి. దాని కోసమే సాధన చెయ్యాలి. మిగతా వాటి మీద దృష్టి వుంచకూడదు.

ఈ విషయం కూడా వశిష్ఠుల వారు చెప్పడం జరిగింది.

**శ్లో॥ నిర్వాణం నామ పరమం సుఖం యేన పునర్జనః**
**న జాయతే న మ్రియతే తద్ జ్ఞానాదేవ లభ్యతే.**

తా:- దేని ద్వారానైతే జీవుడు మళ్ళీ ఈ సంసారంలో జన్మించడో, మరణించడో, అలాంటి పరమ సుఖమే 'నిర్వాణం'. అది కేవలం 'జ్ఞానం' చేతనే లభిస్తుంది.

ఈ విషయం గురించి కొంచెం లోతుగా విశ్లేషణ చేస్తే అంతకన్నా వేరే దారి లేదని కూడా తెలుస్తుంది. దాని కోసం కొన్ని ప్రశ్నలు వేసుకుందాం.

ఎందుచేతనంటే మానవుని దుఃఖానికి అంటే కష్టానికి కారణం ఏమిటి? అంటే మానవుని ప్రస్తుత జీవితంలో ఎంత జాగ్రత్తగా జీవించినా! తన తెలివి తేటలన్ని ఉపయోగించి ఏ లోటూ లేకుండా వెళ్ళిపోయినా అంటే చనిపోయినా మరల వస్తున్నాడు. అంటే దేహం తీసుకుంటున్నాడు. మరల దుఃఖం అనుభవిస్తున్నాడు. అంటే కష్టాలతో, రోగాలతో బాధపడుతున్నాడు. అంటే వెళ్ళిన మానవుడు మరల రావడం వల్లే దుఃఖానికి లోనవుతున్నాడు? కష్టాల పాలవుతున్నాడు ?

దీనిని బట్టి కష్టాలు వుండకూడదంటే ఏమి చెయ్యాలి? అంటే "వెళ్ళినవాడు రాకుండా వుండాలి" అని వెంటనే చెపుతాం. ఎందుచేతనంటే వచ్చాడంటే ఎటువంటి వాడికైనా దుఃఖం తప్పదు. మరి వెళ్ళిన వాడు రాకుండా వుండాలంటే ఏం చెయ్యాలి? ఇది తెలియాలంటే రావడానికి కారణమేమిటో తెలుసుకోవాలి. మరి వెళ్ళినవాడు ఎందుకు వస్తున్నాడు? అంటే కర్మలు చెయ్యడం వల్లనే అని స్పష్టంగా చెప్పవచ్చు.

అంటే మానవుడు ఎంతకాలం కర్మలు చేస్తూ వుంటాడో అంతకాలం మరల, మరల వస్తూ వుంటాడు. అంటే దేహం తీసుకుంటాడు. దుఃఖం అనుభవిస్తాడు. ఎందుచేతనంటే దేహం వుంటేనే కదా రోగాలు వస్తాయి, దుఃఖం కలుగుతుంది. అందుచేత దుఃఖం కలుగకూడదంటే దేహం రాకూడదు, దేహం రాకూడదంటే కర్మలు చేయకూడదు. మరి కర్మలు ఎందుకు చేస్తున్నాడు? కారణం "రాగద్వేషాలు".

రాగద్వేషాలు అంటే... తనవారంటే అనురాగము ఇతరులంటే ద్వేషం. మానవుడు ఇవి ప్రదర్శిస్తూ ఈ కర్మలు చేస్తున్నాడు. సహజంగా ఎవరికైనా తన కుటుంబమన్నా, కులమన్నా, మతమన్నా, ప్రాంతమన్నా, దేశమన్నా

అనురాగముంటుంది. ఇతర కుటుంబాలన్నా, కులాలన్నా, మతాలన్నా, ప్రాంతాలన్నా, దేశాలన్నా ద్వేషముంటుంది. అందుచేత ఇతరులపట్ల ద్వేష భావంతో ప్రవర్తిస్తూ కర్మలు చేస్తూండటం వల్ల మానవుడు మరల మరల జన్మిస్తున్నాడు, కష్టాలు అనుభవిస్తున్నాడు.

అందుచేత మానవుడు రాగద్వేషాలు ప్రదర్శించకూడదని తెలుస్తుంది. మరి రాగద్వేషాలు ఎందుకు ప్రదర్శిస్తున్నాడు? అంటే దానికి కారణం 'అజ్ఞానం'.

'అజ్ఞానం' అంటే ఈ సృష్టిలో అంతా ఒకటే అయినా మానవుడు అంతా వేరు వేరు అని భావిస్తున్నాడు. అలా 'నేను వేరు, ఇతరులు వేరు' అని భావించడమే 'అజ్ఞానం' అంటారు. అందుచేత ఇతరుల పట్ల ద్వేషభావం ప్రదర్శిస్తూ కర్మలు చేస్తున్నాడు. కర్మలు చేస్తూ మరల మరల భూమి మీదకు వస్తున్నాడు. దుఃఖం పొందుతున్నాడు.

అలా మానవుడు ఎంతకాలం అజ్ఞానంలో వుంటాడో అంతకాలం రాగద్వేషాలు ప్రదర్శిస్తాడు. రాగద్వేషాలు ప్రదర్శిస్తున్నంత కాలం కర్మలు చేస్తూంటాడు. కర్మలు చేస్తున్నంత కాలం మరల, మరల వస్తూంటాడు. అంటే దేహం తీసుకుంటాడు. దేహం తీసుకుంటే దుఃఖం తప్పదు. అందుచేత మానవుని దుఃఖానికి కారణం 'అజ్ఞానమని' తెలుస్తుంది.

దీనిని బట్టి మానవుడు అజ్ఞానంలో వున్నంత కాలం దుఃఖం తప్పదని తెలుసుకోవాలి. మరి ఈ 'అజ్ఞానం' ఎలా పోతుంది? అంటే 'జ్ఞానం' వల్ల అంటే 'ఆత్మజ్ఞానం' వల్ల మాత్రమే 'అజ్ఞానం' పోతుంది. ఎందుచేతనంటే 'అజ్ఞానాన్ని' అంధకారంతో అంటే చీకటితో పోలుస్తారు. 'జ్ఞానాన్ని' వెలుతురుతో పోలుస్తారు. వెలుతురు రాగానే చీకటి ఎలా పోతుందో! మానవునిలో జ్ఞానం ఉదయించగానే అజ్ఞానం దానంతట అదే తొలగిపోతుంది.

దీనిని బట్టి మానవుడు దుఃఖం నుంచి బయటపడాలంటే తప్పనిసరిగా 'జ్ఞానం' పొందాలని అర్థమవుతుంది. అలా మానవుడు ఎంతకాలం 'జ్ఞానం' అంటే 'ఆత్మజ్ఞానం' సంపాదించడో!9 అంతకాలం దుఃఖం తప్పదని అర్థమవు తుంది. ఎందుచేతనంటే 'జ్ఞానం' పొందకపోతే దుఃఖం కాని, రోగం కాని వచ్చిన మానవుడు తన ప్రయత్నం చేత ఆ కష్టం నుండి బయటపడినట్టు కని పించినా మరల ఇంకొక దుఃఖంలో చిక్కుకుంటాడు. అందుచేత 'ఆత్మజ్ఞానమే' దుఃఖం నుంచి శాశ్వతంగా బయటపడే మార్గమని అర్థమవుతుంది. మరి ఈ

'ఆత్మజ్ఞానం' ఎలా వస్తుంది? అంటే 'ధ్యానం' వల్ల అని ఇంతకు ముందే తెలుసుకున్నాం.

ఈ విషయాన్నే వశిష్ఠ మహర్షి యోగ వాశిష్ఠంలో చెప్పడం జరిగింది.

**శ్లో॥ అజ్ఞోపి తజ్ఞతామేతి శనైః శైలోపి చూర్ణ్యతే**
**బాణోప్యేతి మహాలక్ష్యం పశ్యాభ్యాస విజృంభితమ్ః**

తా:- అభ్యాసం (ధ్యానం) ద్వారా అజ్ఞాని కూడా క్రమ క్రమంగా జ్ఞానిగా మారుతున్నాడు; పర్వతం కూడా చూర్ణం అవుతోంది; బాణం కూడా అతి సూక్ష్మమైన లక్ష్యాన్ని పొందుతోంది. అహా! అభ్యాసం యొక్క ప్రభావం చూడు!

**శ్లో॥ తచ్చిన్తనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్**
**ఏతదేకపరత్వం చ తదభ్యాసం విదుర్బుధాః**

తా:- బ్రహ్మమును (ఆత్మను) గూర్చే చింతన చేయటం, దానినే ఇతరులకు చెప్పటం, పరస్పరం దానిని గూర్చే ప్రభోధించుకోవడం, దానిలోనే (ఆత్మలోనే) నిష్ఠ గలిగి వుండటం దీనినే విజ్ఞులు "అభ్యాస" మని చెప్పారు.

దీనిని బట్టి 'ధ్యానం' అన్నది దుఃఖాలన్నింటిని శాశ్వతంగా నివారించగలిగే ఏకైక గొప్పమార్గమని తెలుసుకోవాలి.

అందుచేత "ఆరోగ్యం కోసం ధ్యానం కాదు, 'ఆత్మజ్ఞానం' కోసం ధ్యానమని తెలుసుకోవాలి". కారణం ఆరోగ్యవంతుని కంటే 'ఆత్మజ్ఞాని' గొప్పవాడు. కారణం ఆరోగ్యవంతులుగా వున్న వారిలో కూడా సుఖశాంతులు లేవు. కానీ ఆత్మజ్ఞాని ఎప్పుడూ శాంతిగా జీవిస్తాడు.

ఇంకా చెప్పాలంటే ఆరోగ్యవంతుడు తన ఆనందమే చూసుకుంటాడు. కానీ ఆత్మజ్ఞాని అందరి ఆనందం చూస్తాడు. ఆరోగ్యవంతుడు తన ఆనందం కోసం ఇతరులను భాధించటానికి కూడా వెనుకాడడు. కానీ ఆత్మజ్ఞాని అందరి ఆనందం కోసం తన జీవితాన్ని త్యాగం చేస్తాడు.

ఎంతటి ఆరోగ్యవంతుడైనా దుఃఖానికి లోనవుతాడు, ఆనందాన్ని కోల్పోతాడు, చేయగలిగిన పనులు కూడా చేయలేడు. కానీ ఆత్మజ్ఞాని దుఃఖంలో కూడా ఆనందంగా వుంటాడు.

ఒక రకంగా చెప్పాలంటే ఈ చిన్న ఉదాహరణ చూద్దాం. వెయ్యిరూపాయలలో అన్నీ వుంటాయి అంటే 1 రూపాయి వుంటుంది, 2 రూపాయిలు, 5 రూపాయలు, 10 రూపాయలు, 20 రూపాయలు, 50

రూపాయలు, 100 రూపాయలు, 500 రూపాయలు కూడా వుంటాయి. కానీ 1 రూపాయిలో మిగిలినవి వుండవు. అంటే 'ఆత్మజ్ఞానం'లో అన్ని లాభాలు వున్నాయి. కానీ ఆరోగ్యంలో ఒక్క లాభమే కనిపిస్తుంది. మిగిలిన లాభాలు వుండవు. అందుచేత ఆరోగ్యంతో సరిపెట్టుకోవడం కాదు. ఎవరైనా సరే 'ఆత్మజ్ఞానం' కోసం ప్రయత్నించాలి. **"ఆరోగ్యం చూసి సంబరపడటం కాదు. 'ఆత్మజ్ఞాని' అవుతేనే సంబరపడాలి".**

అందుచేత **"ఎంత ఆరోగ్యంగా జీవించాము? అన్నది కాదు. ఎంత 'ఆత్మజ్ఞానం' సంపాదించాము? అన్నదే ముఖ్యం".** ఒక రకంగా జీవితమంతా ఆరోగ్యంగా జీవించినా కొద్దిపాటి 'ఆత్మజ్ఞాన'మైనా సంపాదించకపోతే ఆ జీవితం వృధా అని తెలుసుకోవాలి.

ఇంకా మనం తెలుసుకోవాలంటే, ఆరోగ్యం శరీరం వున్నంత వరకే పని చేస్తుంది కానీ ఆత్మజ్ఞానం ఆత్మతో పాటు జన్మజన్మలకు వస్తుంది. అంటే **"ఆరోగ్యం తాత్కాలికం, కానీ 'ఆత్మజ్ఞానం' శాశ్వతమని తెలుసుకోవాలి".** అంతేకాదు ఎంత ఆరోగ్యవంతులైనా పాపాలు చేస్తూనే వుంటాడు. కష్టాలు తెచ్చుకుంటాడు, కానీ 'ఆత్మజ్ఞాని' పాపాలు చెయ్యడు. కష్టాలు తెచ్చుకోడు. ఇంకా చెప్పాలంటే ఆరోగ్యవంతుడికి 'ముక్తి' రాదు, కానీ ఆత్మజ్ఞాని "ముక్తి"ని పొందగలడు.

అందుచేత అందరినీ ఆరోగ్య వంతులుగా చేసే సేవ కంటే అందరినీ ఆత్మజ్ఞానులుగా చేసే సేవ చాలా చాలా గొప్పది. అందుచేత లక్ష మంది ఆరోగ్య వంతులను చేసిన వాడి కంటే ఒక్కరిని ఆత్మజ్ఞానిగా చేసిన వాడే గొప్పవాడు.

మానవులు భవబంధాలలో చిక్కుకుని వున్నారు. వీటన్నిటి నుండి విడుదల కావడమే 'ముక్తి'. ముఖ్యంగా ప్రతి ఒక్కరు సంసారంలో బందీఅయి వున్నారు. సంసారంలో వుండటం వలన ఎన్నో బాధ్యతలు కూడా వుంటాయి. స్త్రీకి ఇంటి బాధ్యతలు, పురుషుడికి సంపాదనా బాధ్యతలు వుండటం వల్ల వీటిలోంచి బయటపడటం కష్టసాధ్యమవుతుంది. వాటితో పాటు పంచ ఇంద్రియాల వల్ల కలిగే ఆకర్షణకు లోనై ఎన్నో సరదాలు, ఎన్నో సుఖాలలో మునిగిపోయి వాటిలోంచి బయటపడలేకపోతున్నారు. అలా ఆకర్షణలకి ఆకర్షితులై బాధ్యతలకు బందీ అయి జీవిస్తున్న మానవులకు అనుకోకుండా

అనుకోని సమస్యలు, కష్టాలు, బాధలు, ఇబ్బందులు ఎదురవుతూ వుంటాయి. అవి ఎందుకు వస్తున్నాయో అర్థం కాక వాటిని తట్టుకోలేక బయటపడాలని ప్రయత్నం చేస్తూ వుంటారు. ఎన్ని ప్రయత్నాలు చేసినా వారికి బయటపడటం సాధ్యం కాదు. ఏమి చెయ్యాలో దిక్కుతోచక, ఏ దిక్కులేని వాడికి దేవుడే దిక్కు అనుకుంటారు. ప్రార్థనలు, ఆరాధనలు చేస్తూ వుంటారు. సహజంగా మానవుల పరిస్థితి ఈ విధంగా వుంది.

కానీ అసలు మానవుని కష్టాలకు కారణం మానవులకు భగవంతుని అంటే ఈ సృష్టిలోని 'కర్మ సిద్ధాంతం' గురించి తెలియకపోవడం, సరైన అవగాహన లేకపోవడం. దానికి కారణం బోధకులు 'కర్మ సిద్ధాంతం' గురించి గట్టిగా చెప్పకపోవడం, సామాన్యులలో అవగాహన కలిగించకపోవడం.

ఎందుచేతనంటే బోధకులు ఎంతసేపూ వచ్చిన కష్టాలు పోయే మార్గాలు చెపుతున్నారు కానీ కష్టాలు రాకుండా చేసుకోమని గట్టిగా చెప్పడం లేదు. పాపాలు అంటే పాప కర్మలు పోయే మార్గాలు చెబుతున్నారు కానీ పాపాలు చెయ్యొద్దని గట్టిగా చెప్పడం లేదు. సామాన్య జనులు పాపాలు చెయ్యడానికి కారణం చెప్పడం లేదు, పాపాలు చెయ్యకుండా వుండాలంటే ఏం చెయ్యాలో చెప్పడం లేదు.

అంతేకాదు పుణ్యాలు, అంటే పుణ్యకార్యాలు, అంటే పుణ్యకర్మలు చెయ్యమని చెపుతున్నారు కానీ పుణ్యకార్యాలు, పుణ్యకర్మలు కష్టాలు రాకుండా చెయ్యలేవు, కష్టాలను పోగొట్టలేవు అన్న విషయం మీద అవగాహన కలిగించడం లేదు.

ఎందుచేతనంటే భగవంతుని సృష్టిలో పాప కర్మలు చేసేవారు కష్టాల్ని, పుణ్యకర్మలు చేసే వారు భోగాల్ని అనుభవిస్తారు. పుణ్యకర్మలు చేస్తూ పాపాలు చేసేవారు భోగాలతో కష్టాలు అనుభవిస్తారు అంటే సంపదలతో రోగాలు అనుభవిస్తారు. పుణ్యకర్మలు చెయ్యకుండా పాప కర్మలు చేసేవారు భోగాలు లేకుండా కష్టాలు అనుభవిస్తారు. అంటే ధనం లేకుండా రోగాలు అనుభవిస్తారు.

దీనికి చిన్న ఉదాహరణ చూద్దాం. పుణ్యము, పాపము రెండూ చేసేవారు సూపర్ స్పెషాలిటీ హాస్పటల్‌లో ఎ/సి రూమ్‌లో రోగానికి వైద్యసేవలు పొందుతారు. కానీ పుణ్యం చెయ్యకుండా పాపమే చేసిన వారు గవర్నమెంటు హాస్పిటల్‌లో జనరల్ వార్డులో రోగానికి వైద్య సేవలు పొందుతారు.

అలాగే పాప కర్మలు చెయ్యరు, పెద్దగా పుణ్యకర్మలు చెయ్యరు. వారికి కష్టాలు రావు, పెద్దగా భోగాలు వుండవు. సామాన్య జీవితం లభిస్తుంది. అలాగే పాపకర్మలు చెయ్యరు. పైగా పుణ్యకర్మలు విశేషంగా చేస్తారు. వారి జీవితంలో కష్టాలు వుండవు. పైగా భోగాలు అనుభవిస్తూంటారు.

అలా రకరకాల జీవితాలు కలిగిన వారు మనకు లోకంలో కనిపిస్తారు. అంటే మానవుని జీవితం వారు గతంలో చేసుకున్న 'కర్మలను' బట్టే వుంటుందని తెలుసుకోవాలి. ఈ విషయమే మనం దేవుళ్ళనుకునే వారంతా చెప్పడం జరిగింది. ఆ విషయాలు ఇంతకు ముందే మనం తెలుసుకున్నాం.

అలాగే మానవులు చేసే కర్మలలో ఇంకో రకం కర్మలు కూడా వున్నాయి. వాటినే "ముక్తి కర్మలు" అంటారు. "ఆత్మకర్మలు" అంటారు. అంటే "ఆత్మజ్ఞానం" పొందడం కోసం చేసే కర్మలు. అవే మానవులకు ముక్తినిస్తాయి. అంటే 'నిర్వాణాన్ని' కలిగిస్తాయి. అంటే కష్టాల నుంచి శాశ్వతంగా బయటపడేస్తాయి.

అవే (1) 'ధ్యాన సాధన', (2) 'స్వాధ్యాయం', (3) 'సాంగత్యం', ఇటువంటి కర్మలు చేసే వారు మాత్రమే 'ముక్తి'ని పొందగలరు.



అందుకే బుద్ధభగవానుడు
"పాపాలు చేసేవారు నరకానికి,
పుణ్యాలు చేసేవారు స్వర్గానికి పోతారు
'ధ్యానం' చేసేవారు పరినిర్వాణాన్ని పొందుతారు"
అని చెప్పడం జరిగింది.

ఇదే విషయాన్ని శ్రీ ఆది శంకరచార్యుల వారు కూడా చెప్పడం జరిగింది. అంటే 'ధ్యానసాధన, స్వాధ్యాయం, సాంగత్యం' లాంటి పనులు చేసేవారు కష్టాల నుంచి శాశ్వతంగా బయటపడగలరని చెప్పారు. ఆయన ఏమన్నారంటే



"భగవద్గీతా కించిదధీతా
గంగాజల లవ కణీకాపీతా
సకృదపియేన మురారి సమర్చా
క్రియతాతస్యయమేనన చర్చా"

తా:- ఎవరైతే భగవద్గీతను కొంచెమైనా అధ్యయనం చేస్తారో! ఎవరైతే గంగా జలాన్ని కనీసం ఒక్క బొట్టైనా పానం చేస్తారో! ఎవరైతే "ఆత్మజ్ఞానులతో కనీసం ఒక్క పర్యాయమైనా నిజంగా చర్చిస్తారో! అలాంటి వారిని గూర్చి యముడు పట్టించుకోడు.

శ్రీ ఆది శంకరాచార్యులు వారు యముడు పట్టించుకోడు అన్నారు. అంటే అర్థం కష్టాలు శాశ్వతంగా రావు అన్న మాట. కారణం యముడు పట్టించుకుంటేనే కష్టాలు. యముని దృష్టి పడితేనే కష్టాలు. కారణం శిక్షలు వేసేది యముడే కాబట్టి. మరి యముడు ఎవరిని పట్టించుకోడు. భగవద్గీతను కొంచెమైనా అధ్యయనం చెయ్యాలి, గంగాజలాన్ని ఒక్క బొట్టైనా త్రాగాలి, ఆత్మజ్ఞానులతో ఒక్కసారైనా చర్చించాలి. అలాంటి వారినే యముడు పట్టించుకోడని ఆదిశంకరాచార్యుల వారు చెప్పడం జరిగింది.

కానీ ఇక్కడ గమనిస్తే కాశీలో భగవద్గీతను ఎన్నోసార్లు పారాయణ చేసిన వారు వున్నారు. దానితో పాటు వారు రోజూ గంగాజలాన్ని గ్లాసులు గ్లాసులు తాగుతున్నారు. అక్కడే వున్న పండితులతో చర్చలు జరుపుతున్నారు. ఉపన్యాసాలు వింటున్నారు. మరి వారందరికీ 'ముక్తి' వచ్చేసిందా? కష్టాలు రావట్లేదా? అంటే లేదని కచ్చితంగా చెప్పవచ్చు.

మరి శంకరాచార్యుల వారు చెప్పింది అసత్యమా? అంటే కానే కాదు. కారణం అంతటి గొప్ప 'ఆత్మజ్ఞాని' అయిన శంకరాచార్యుల వారు అసత్యం చెప్పరు. ఆయన ఏది చెప్పినా సత్యమే చెపుతారు. ఎందుచేతనంటే అంతటి గొప్పవారు చెప్పినదాంట్లో ఎంతో అంతరార్థం వుంటుంది. మనకు దాని బాహ్యార్థమే తెలుస్తుంది కానీ అంతరార్థం తెలుసుకునే 'జ్ఞానం' మన దగ్గర లేదు. అందుచేత దానిలోని అంతరార్థం తెలుసుకుందాం.

దాని అంతరార్థం బ్రహ్మర్షి పత్రీజీ మనకు చాలా చక్కగా వివరించారు.

## బ్రహ్మర్షి పత్రీజీ వివరణ



ఆత్మజ్ఞానంతో కూడిన, ఆత్మానుభవంతో వ్రాయబడిన, ఆధ్యాత్మిక గ్రంథాల్ని కొంచెమైనా చదవాలి.

ధ్యాన స్థితిలో సమాధి స్థితిలో వున్నప్పుడు 'ఖేచరీముద్ర' ద్వారా లాలాజలం విశ్వశక్తితో ఏకమై అమృత బిందువులుగా మానవుడు ఆ గంగాజలాన్ని ఒక్క బొట్టు

అయినా త్రాగాలి. అంటే అనునిత్యం ధ్యానం చెయ్యాలి.

అలాగే ఎవరైతే కొంతైనా సజ్జన సాంగత్యం చేస్తారో! అలాంటి వారు మరణించిన తరువాత వారు ఈ భూ మండలం నుంచి నిష్క్రమించి ఊర్ధ్వలోకాలకు చేరినపుడు వారిని నిలబెట్టి గద్దించే వారు ఎవ్వరూ వుండరు. అంటే చర్చ చేసేవారు ఎవ్వరూ వుండరు.

శ్రీ ఆదిశంకరాచార్యుల వారు ఆధ్యాత్మిక శాస్త్ర త్రిరత్నాలైన "ధ్యాన, స్వాధ్యాయ, సజ్జన సాంగత్యాలనే" మూడింటిని చక్కటి పదాలలో అద్భుతంగా వివరించారని పత్రీజీ శ్రీ ఆది శంకరాచార్యుల వారి సందేశానికి చక్కటి వివరణ ఇచ్చారు.

దీనిని బట్టి చూస్తే ముక్తి పొందాలంటే 'ఆత్మజ్ఞానం' అవసరమని తెలుస్తుంది. అటువంటి 'ఆత్మజ్ఞానం' విశేషమైన ధ్యాన సాధన చేస్తూ, ఆత్మజ్ఞానానికి సంబంధించిన పుస్తకాలు చదువుతూ, ఆత్మజ్ఞానులతో సాంగత్యం చేస్తేనే వస్తుందని పై సందేశాల ద్వారా మనకు అర్థమవుతుంది.

కానీ ఈ మార్గం తెలియక కష్టాలతో జీవిస్తున్న వారిలో కొంతమంది ఏమిటి ఈ జీవితం? ఎందుకు ఈ జీవితం? అనుకుంటూ ఇందులో నుంచి బయటపడలేమా? ఎలా బయటపడాలి? బయటపడితే బాగుంటుందని ఆలోచిస్తూ వుంటారు. అలా ఆలోచించేవారు కొంతమంది పెద్దలను, పండితుల ను, గురువులను ఆశ్రయిస్తూ వుంటారు. అప్పుడు వారు ఆత్మమార్గమైన ధ్యాన సాధనను బోధిస్తారు. ఈ ఆసక్తి వున్నవారిలో కొంతమందే వారు బోధించిన సాధనను కొనసాగించగలుగుతారు. మిగిలిన వారికి ఆసక్తి వున్నా సంసారిక, ప్రాపంచిక ఇబ్బందులు అధిగమించలేక సాధనను సరిగ్గా కొనసాగించ లేకపోతారు.

కానీ వారిలో కొంతమంది తీవ్ర సాధన చేస్తారు. ఏమైనా సరే సాధించాలి. మోక్షం పొందాలి అనే పట్టుదల వుంటుంది. దీనినే 'ముముక్షత్వం' అంటారు. తీవ్ర సాధన చేస్తున్న వారిలో సహజంగా ప్రకృతిలో కొన్ని అవ రోధాలు ఎదురవుతాయి. కొన్ని పరీక్షలు ఎదుర్కోవలసి వస్తుంది. తీవ్ర సాధన చేసే వారిలో చాలా మంది ఈ స్థాయిలో సాధనను కొనసాగించలేక పోతారు. అనుకున్నది సాధించలేకపోతారు. అటువంటి వారిలో చాలా కొద్దిమంది అంటే ఒక్కరో, ఇద్దరో మాత్రమే లక్ష్యాన్ని సాధించగలుగుతారు. మోక్షాన్ని

పొందగలుగుతారు.

ఈ విషయాన్నే శ్రీ కృష్ణుల వారు చెప్పడం జరిగింది.

**శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే**
**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః (భ.గీ.7-3)**

తా:- అనేక వేల మంది మనుజులలో ఏ ఒకానొకడో మోక్ష సిద్ధికై యత్నించుచున్నాడు. అట్లు యత్నించు అనేక మందిలో ఏ ఒకానొకడు మాత్రమే ఆత్మజ్ఞానాన్ని వాస్తవముగా తెలుసుకొనగలుగుచున్నాడు.

అలా వివేకం వున్నవారు ఎన్ని అవరోధాలు ఎదురైనా వాటిని అధిగమించి లక్ష్యాన్ని సాధించ గలుగుతారు. వారినే విజ్ఞులు అంటారు. అలా మానవులలో రకరకాల స్థాయిలలో వున్న వారిని పత్రీజీ మూడు రకాలుగా పేర్కొనారు.

## అజ్ఞుడు, అల్పజ్ఞుడు, విజ్ఞుడు

**అజ్ఞుడు :-** అజ్ఞానంతో వున్నవాడు. ఈ శరీరమే నేను. శరీరంతో సుఖాలు అనుభవించడమే జీవితం అని భావిస్తూ ఆ రకంగా జీవించేవాడు.

**అల్పజ్ఞుడు :-** కొన్ని తెలుసుకుంటాడు. ఈ శరీరం నేను కాదు. 'ఆత్మే' నేను అన్నది తెలుసుకుంటాడు. తెలుసుకున్నా శరీరమే నేను అన్నట్లుగా జీవిస్తాడు. వీడు అల్పజ్ఞుడు.

**విజ్ఞుడు :-** అంటే విశేష జ్ఞానం వున్నవాడు. వీడు శరీరానికి ప్రాముఖ్యం ఇవ్వకుండా, శరీర సుఖాలకు ప్రాముఖ్యం ఇవ్వకుండా, ఆత్మకు ప్రాముఖ్యం ఇస్తాడు. ఆత్మ సాధన అయిన 'ధ్యానం' విశేషంగా చేస్తాడు. చివరకు 'ఆత్మజ్ఞానం' అనుభవపూర్వకంగా సంపాదిస్తాడు. అలాంటి వారి ప్రవర్తన పూర్తిగా మారిపోతుంది.

అంటే మానవునిలో 'జ్ఞానం' పెరిగే కొద్దీ ప్రవర్తనలో మార్పు వస్తుంది. 'జ్ఞానం' పెరగకపోతే ఎటువంటి మార్పు రాదు. 'జ్ఞానం' పెరగకపోతే ఎక్కడ వేసిన గొంగళి అక్కడేలా వుంటుంది. అందుచేత 'జ్ఞానం' పెరిగే కొద్దీ ఎలాంటి మార్పులు వస్తాయో చూద్దాం.

సహజంగా 'జ్ఞాని' ప్రాపంచిక విషయాల పట్ల విరక్తి కలిగి వుంటాడు. ఆత్మవిషయాల పట్ల ఆసక్తి కలిగి వుంటాడు. కానీ 'అజ్ఞాని' ప్రాపంచిక విషయాల పట్ల ఆసక్తి కలిగి వుంటాడు. ఆత్మ విషయాల పట్ల విరక్తి ప్రదర్శిస్తుంటాడు.

'జ్ఞాని' దుఃఖంలో కూడా ఆనందంగా జీవిస్తాడు. కానీ 'అజ్ఞాని' ఆనందంగా వుండవలసిన సందర్భాలలో కూడా దుఃఖిస్తాడు.

'జ్ఞాని' కోరికలను అదుపులో వుంచుకుంటాడు. కానీ 'అజ్ఞాని' కోరికలకు బానిస అవుతాడు.

'జ్ఞాని' ఆశపడడు. కానీ 'అజ్ఞాని' అన్నిటికీ ఆశపడతాడు.

'జ్ఞాని' ఉన్నదానితో తృప్తిగా జీవిస్తాడు. కానీ 'అజ్ఞానికి' ఎన్ని ఉన్నా తృప్తి వుండదు.

'జ్ఞాని' వున్న దాన్నే పంచుతాడు. కానీ 'అజ్ఞాని' ఏదీ పంచలేడు.

'జ్ఞాని' ఇవ్వకుండా వుండలేడు. అజ్ఞాని ఇవ్వలేడు.

'ఆత్మజ్ఞాని'కి అంతా ఒక్కటే కాని 'అజ్ఞాని' అంతా వేరు వేరు అనుకుంటాడు.

'జ్ఞాని' అందరినీ ప్రేమిస్తాడు. తన వాళ్ళతో సహా అందరినీ సమానంగా భావిస్తాడు కానీ 'అజ్ఞాని' అందరినీ ద్వేషిస్తాడు. తన వారిని ప్రత్యేకంగా చూస్తాడు. అంటే రాగద్వేషాలు ప్రదర్శిస్తాడు.

'జ్ఞాని' ఇతరుల కోసం ఆలోచిస్తాడు. కానీ 'అజ్ఞాని' తన కోసమే ఆలోచిస్తాడు.

'జ్ఞాని' ఇతరుల ఆనందం కోసం పాటుపడతాడు. కానీ 'అజ్ఞాని' తన ఆనందమే చూసుకుంటాడు.

'జ్ఞాని' లోక కళ్యాణకరమైన కార్యక్రమాలు నిర్వహిస్తాడు. వాటిని ప్రోత్సహిస్తాడు. వాటికి సహకరిస్తాడు. కానీ అజ్ఞాని ప్రోత్సహించడు. సహకరించడు.

'ఆత్మజ్ఞాని' చెయ్యకూడని పనులు చేయడు. అందుచేత కష్టాలు రావు. పైగా చెయ్యవలసిన పనులే చేస్తాడు. అందరికీ లాభం కలిగించే పనులే చేస్తాడు. అందుచేత భవిష్యత్తులో అన్నీ లాభాలే. అంతా ఆనందమే వుంటుంది. దుఃఖం వుండదు. కానీ 'అజ్ఞాని' చెయ్యకూడని పనులు చేస్తాడు. అందరికీ నష్టం కలిగించే పనులు చేస్తాడు. చివరికి కష్టాల పాలవుతాడు. దుఃఖంతో జీవిస్తాడు.

'జ్ఞాని' ఇతరులలోని గొప్పతనాన్ని, విశిష్టతలను చూస్తాడు కానీ 'అజ్ఞాని' ఇతరులలోని లోపాలే చూస్తాడు.

'జ్ఞాని' తాను చేసే పని ధర్మమా? కాదా? అని చూస్తాడు. తన

గురించి ఇతరులు ఏమనుకున్నా లెక్క చెయ్యడు. కానీ 'అజ్ఞాని' ఇతరులు ఏమనుకుంటారోనని చేయవలసింది కూడా చెయ్యడు.

'జ్ఞాని' అరిషడ్వర్గాలు అదుపులో వుంచుకుంటాడు. కానీ 'అజ్ఞానికి' అదుపులో వుండవు.

'జ్ఞానికి' త్రికరణశుద్ధి వుంటుంది. కానీ 'అజ్ఞానికి' వుండదు.

'జ్ఞాని'కి ధర్మం తెలుస్తుంది, ధర్మాచరణ వుంటుంది. కానీ 'అజ్ఞాని'కి ధర్మం తెలియదు. ధర్మాచరణ వుండదు.

'జ్ఞాని' ద్వంద్వాలలో సమస్థితిలో వుంటాడు. కానీ 'అజ్ఞాని' ఉండడు. ద్వంద్వాలు అంటే సీతోష్ణాలు, గెలుపు ఓటములు, నిందాస్తుతులు, సుఖ, దుః ఖాలు, మానాపమానాలు.

'జ్ఞానికి' మాట మీద ఎరుక వుంటుంది, అదుపు వుంటుంది కానీ 'అజ్ఞానికి' రెండూ వుండవు.

'జ్ఞాని' సృష్టి నియమాలు, ధర్మాలు, సిద్ధాంతాలు తెలుసుకుంటాడు, వాటి ప్రకారం నడుచుకుంటాడు. కానీ 'అజ్ఞాని' తెలుసుకోడు, నడుచుకోడు,

'జ్ఞాని' సృష్టికి అనుగుణంగా జీవిస్తాడు. కానీ 'అజ్ఞాని' సృష్టికి విరుద్ధంగా జీవిస్తాడు.

'జ్ఞాని' సృష్టి నిర్ణయాన్ని గౌరవిస్తాడు. కానీ 'అజ్ఞాని' సృష్టి నిర్ణయాన్ని గౌరవించలేడు. తద్వారా సృష్టిని అవమానించిన వాడవుతాడు. నష్టపోతాడు.

లోకంలో చూడటానికి అంతా మానవుల లాగే కనిపిస్తారు. కానీ వారి ప్రవర్తనలోనే చాలా తేడా వుంటుంది. ఆలోచనా విధానంలో తేడా వుంటుంది. మాట్లాడే విధానంలో తేడా వుంటుంది. చేసే కర్మలు, కోరే కోరికల్లో చాలా తేడా వుంటుంది. అంతే కాదు చాలా మంది దుఃఖంలో వుంటారు. కొంతమందే ఆనందంగా జీవిస్తూ వుంటారు. కొంతమంది లోకానికి ఇతరులకు సేవలు చేస్తూ వుంటారు. చాలామంది లోకానికి, ఇతరులకు కీడు చేస్తారు, నష్టాన్ని, కష్టాల్ని కలిగిస్తారు. కొంతమంది పాపాలు చేస్తుంటే, కొంతమంది మంచి కార్యాలు చేస్తున్నారు. చాలామంది భగవంతుడెవరో తెలుసుకోకుండా ఆరాధనలు చేస్తుంటే! కొద్దిమంది మాత్రమే భగవంతుని "ఆత్మ తత్వాన్ని" తెలుసుకుని దానికి తగ్గ 'ధ్యాన' సాధనలు చేస్తున్నారు.

మరి మానవుల ప్రవర్తన ఇలా వుండటానికి కారణం? మానవులకు భగవంతుని యొక్క సృష్టి యొక్క "జ్ఞానం" లేకపోవడమే. అటువంటి జ్ఞానం లేని వారిని 'అజ్ఞానులు' అంటారు. వున్నవారిని 'జ్ఞానులు' అంటారు.

భగవంతునికి సంబంధించిన, భగవంతుని సృష్టికి సంబంధించిన 'జ్ఞానం' వున్న వారి ప్రవర్తన ఒక రకంగా వుంటుంది. అది లేని వారు, అంటే 'అజ్ఞానుల' ప్రవర్తన మరొక విధంగా వుంటుంది.

ఒక విధంగా చెప్పాలంటే **"ఎవరికైనా కష్టాలు వున్నాయి అంటే! వారు సృష్టి ధర్మాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారనే లెక్క"** అలా ప్రవర్తించడానికి కారణం వారి యొక్క 'అజ్ఞానం'.

మరి మనమిపుడు 'అజ్ఞానం'లో వున్నామా? 'జ్ఞానం' పొందామా? ఏ స్థితిలో వున్నాం? ఎలా తెలుస్తుంది? అంటే ఈ విషయం భగవద్గీతలో శ్రీ కృష్ణ భగవానుడు తెలియ చేయడం జరిగింది. మరి భగవానుని ప్రకారం ఎవరు 'జ్ఞానులు'? ఎవరు 'అజ్ఞానులు'? అన్నది చూద్దాం. ముందుగా భగవానుని సందేశం ప్రకారం జ్ఞానులు ఎలా వుండాలో చూద్దాం.

# "భగవద్గీతను బట్టి జ్ఞానులు!



శ్లో॥ అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాన్తిరార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః **(భ.గీ.13-8)**

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ
జన్మ మృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్ **(భ.గీ.13-9)**

శ్లో॥ అసక్తి రనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు **(భ.గీ.13-10)**

శ్లో॥ మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్త దేశ సేవిత్వమరతిర్జనసంసది. **(భ.గీ.13-11)**

శ్లో॥ అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్
ఏతజ్ఞ్జానమితి ప్రోక్తమజ్ఞానం యదతోన్యథా (భ.గీ. 13-12)

తా:- తన్ను తాను పొగడుకొనకుండుట, డంబము లేకుండుట పర ప్రాణులను, జీవులను బాధింపకుండుట, ఓర్పు గలిగి యుండుట, ఋజుత్వము (శుద్ధి) కలిగి యుండుట, సన్మార్గమున, మోక్ష మార్గమున స్థిరముగా నిలబడుట, మనస్సును బాగుగ నిగ్రహించుట ఇంద్రియ విషయములగు శబ్దస్పర్శాదులందు విరక్తి గలిగియుండుట, అహంకారము లేకుండుట, పుట్టుక, చావు, ముసలితనము, రోగము అను వాని వలన కలుగు దుఃఖమును మాటిమాటికి స్మరించకుండుట. కొడుకులు (సంతానము), భార్య మున్నగు వారికి కలుగు సుఖ దుఃఖములు తనకే కలిగినట్లు భావింపకుండుట, ఇష్టానిష్టములు, శుభాశుభములు సంప్రాప్తించినపుడు సమబుద్ధి గలిగియుండుట నా యందు (ఆత్మయందు) అనన్యమైన భక్తి కలిగియుండుట, ఏకాంత ప్రదేశమును (అనగా ప్రతిబంధము లేని చోటును) ఆశ్రయించుట, జనసమూహము నందు ప్రీతి లేకుండుట, ఆత్మజ్ఞానము (ఆత్మనిష్ఠ) నిరంతరము గలిగియుండుట, తత్త్వ జ్ఞానముయొక్క గొప్ప ప్రయోజనమును తెలిసికొనుట అనునవి జ్ఞానమని చెప్పబడును.

## "భగవద్గీతను బట్టి అజ్ఞానులు"

శ్లో॥ ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే (భ.గీ. 16-7)

తా:- అసుర స్వభావము గల వారై, ధర్మ ప్రవృత్తిని గాని, అధర్మ నివృత్తిని గాని ఎరుగరు. శుచిత్వము గాని, ఆచారము (సత్కర్మానుష్ఠానము) గాని, సత్యము గాని వుండదు.

శ్లో॥ కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితాః
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ ప్రవర్తన్తేశుచివ్రతాః (భ.గీ. 16-10)

తా:- తనివి తీరని కామము (కోరికలు) నాశ్రయించి, డంబము, అభిమానము, మదము (గర్వము) కలవారై, అవివేకము వలన చెడు పట్టుదలలనాశ్రయించి, నీచ వృత్తులు గల వారై ప్రవర్తించెదరు.

శ్లో॥ ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్ (భ.గీ. 16-12)

తా:- పెక్కు ఆశాపాశములచే (ఆశలు, బంధములు) బంధింపబడిన వారై, కామ, క్రోధములనే ముఖ్యముగా ఆశ్రయించిన వారై కోరికలు అనుభవిం చుట కొరకు అన్యాయ మార్గముల ద్వారా ధనాన్ని కోరుతూ వుండేవారు.

శ్లో॥ ఇదమద్య మయా లబ్ధమిమం ప్రాప్స్యే మనోరథమ్
ఇదమస్తీ దమసి మే భవిష్యతి పునర్ధనమ్ (భ.గీ. 16-13)

శ్లో॥ అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి
ఈశ్వరోహమహం భోగీ సిద్ధోహం బలవాన్ సుఖీ (భ.గీ. 16-14)

శ్లో॥ ఆఢ్యోభిజనవానస్మి కోన్యోస్తి సదృశో మయా
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః (భ.గీ. 16-15)

శ్లో॥ అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః
ప్రసక్తాః కామభోగేషు సతన్తి నరకేశుచౌ (భ.గీ. 16-16)

తా:- "నేను కోరుకున్నది పొందాను. ఈ కోరికను ఇక మీదట పొందగలను; ఈ ధనము ఇపుడు నాకు ఉంది, ఇంకా ఎంతో ధనము నేను సంపాదించగలను అని భావిస్తారు.

ఈ శత్రువును నేనిపుడు చంపితిని. తక్కిన శత్రువులను కూడా చంపగలను; నేను గొప్పవాడను. సమస్త భోగములను అనుభవించుచున్నాను. తలచిన కార్యము నెరవేర్చుకోగల శక్తికలవాడను, బలవంతుడను, సుఖవంతుడను, ధనవంతుడను అని గర్వించేవారు.

గొప్ప వంశమున జన్మించిన వాడను. నాతో సమానమైన వాడు మరియొకడు ఎవడు కలడు? నేను యజ్ఞాలు చేస్తాను, దానములనిస్తాను, ఆనందాన్ని అనుభవిస్తాను అని అహంకారం ప్రదర్శించేవారు.

అనేక విధములైన చిత్తచాంచల్యములతో వున్నవారు. మోహము (భార్య, పుత్ర, పౌత్రాదులందు అభిమానము)చే కప్పబడిన వారు. కామము (కోరికలు) అనుభవించుట యందు మిగుల ఆసక్తి గల వారు. వీరంతా అసుర ప్రవృత్తి కలవారు అంటే 'అజ్ఞానము'లో వున్నవారు. వీరంతా నరకములో పడతారు.

శ్లో॥ ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః
యజన్తే నామయజ్ఞై స్తే దమ్భనావిధిపూర్వకమ్ (భ.గీ. 16-17)

తా:- వీరు తమను తాము గొప్పగా తలుస్తారు. మర్యాద వుండదు. ధనం వుందని, అభిమానంతో (గొప్పతనంతో) మదంతో ఉంటారు. అహంకారము,

బలము, గర్వము, కామము, క్రోధము బాగా ఉంటుంది. తమ శరీరములో, ఇతరుల శరీరములలో ఉన్న నన్ను (ఆత్మను) తెలియక అందరినీ ద్వేషిస్తారు, అసూయాపరులై ఉంటారు. గొప్పకోసం శాస్త్ర విరుద్ధంగా నామమాత్రపు యజ్ఞయాగాలు చేస్తుంటారు.

అలా భగవానుడు అజ్ఞానంలో వుండేవారి ప్రవర్తన గురించి చెప్పడం జరిగింది. మరి మనం మన ప్రవర్తనను బట్టి అజ్ఞానంలో వున్నామా? జ్ఞానం పొందామా? అన్నది తెలుసుకోవాలి. ఒకవేళ మన ప్రవర్తన అజ్ఞానకరంగా వుంటే తప్పనిసరిగా మన ప్రవర్తన మార్చుకోవాలి. దానికి 'ధ్యాన సాధన' చెయ్యాలి.

# యోగ వాశిష్ఠం



అలాగే ఆత్మజ్ఞానం పొందిన వారి స్థితి ఎలా వుంటుందో యోగవాశిష్ఠం ద్వారా వశిష్ఠ మహర్షి ఈ క్రింది శ్లోకాల ద్వారా చెప్పడం జరిగింది.

**శ్లో॥ దేవాస్తు దేహధర్మేణ**
**జీవన్ముక్తిమతామపి**
**గృహ్యతే తద్గతం తేషాం**
**చేతస్త్వచలమేవ తత్.**

తా:- జీవన్ముక్తులకు కూడా దేహం దేహధర్మంతో కూడే వుంటుంది. కానీ, ఆ దేహంలోని చిత్తం మాత్రం వారికి సదా నిశ్చలంగా, నిర్వికారంగా ఉంటుంది.

**శ్లో॥ ఆత్మతాపరతే త్వత్తామత్తే యస్యమహాత్మనః**
**భవాదుపరతే మానం స పశ్యతి సులోచనః**

తా:- "నాది, నీది, ఇతరులది" ఇలాంటి భావనలు సాంసారిక దేహాదుల పట్లఏ మహాత్ముడికి నశిస్తాయో, అతడే నిజంగా సత్యాన్ని చూసినవాడు.

అంతేకాక, అతడే జ్ఞాననేత్రం కలవాడు.

**శ్లో॥ ఆత్మవానిహ సర్వస్మాదతీతో విగతైషణః**
**ఆత్మ న్యేవ హి సంతుష్టోన కరోతి న చేహతే**

ఈ ప్రపంచంలో 'ఆత్మజ్ఞాని' సమస్త పదార్థాల కంటే అతీతుడై, ఈషణారహితుడై (మమకారం లేనివాడు) (1) ధారేషణ (భార్య మీద మమకారం) (2) ధనేషణ (ధనం మీద మమకారం), (3) పుత్రేషణ (పిల్లల మీద మమకారం). ఆత్మయందే సంతుష్టుడై వుంటాడు. అతడు దేనినీ కోరడు, ఏమి చేయడు.

**శ్లో॥ విగతేచ్ఛా యథాప్రాప్త వ్యవహారానువర్తినః**
**విచరన్తి సమున్నద్ధాః స్వస్థాదేహరథేస్థితాః**

తా:- జీవన్ముక్తులైన మహాత్ములు కోరికలు లేని వారై ప్రాప్తించిన వాటితో తృప్తి చెంది విజ్ఞతతో మనస్సును స్వాధీనంలో వుంచుకుని ఈ దేహంతో విహరిస్తూ వుంటారు.

**శ్లో॥ యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః**
**హర్షామర్ష భయోన్ముక్తః స జీవన్ముక్త ఉచ్యతే.**

తా:- ఎవరివలన లోకానికి భయం లేదో, లోకం వల్ల ఎవరికి భయంలేదో, ఎవరు హర్ష, క్రోధ, భయరహితులో వారు జీవన్ముక్తులని పేర్కొనబడతారు.

**శ్లో॥ ఉపలా అపి మిత్రాణి బంధవో వనపాదపాః**
**వనమధ్యే స్థితస్యాపి స్వజనా మృగపోతకాః**

తా:- ఆత్మజ్ఞానికి శిలలు కూడా మిత్రులే. వనవృక్షాలు కూడా బంధువులే, వనం మధ్యలో వున్నప్పుడు మృగాలు కూడా అతనికి స్వంత వారిలా ఒప్పుతారు. మిత్రాదుల పట్లా, శిలాదుల పట్లా, సంయోగ వియోగాదులలో సమానమైన అంత:కరణ స్థితి కల్గి వుంటాడు.

**శ్లో॥ లోకాచారవిరుద్ధేషు శవం సకలకర్మసు**
**ఆర్యాచారవిచారేషు వాసుకిర్వా బృహస్పతిః**

'ఆత్మ జ్ఞాని' అనేవాడు ఆత్మ విరుద్ధాలైన కర్మలలో "శవం" లాగా నిర్లిప్తంగా వుంటాడు. ఆత్మ విచారణ యందు ఆదిశేషుడులాగా వుంటాడు; బృహస్పతి లాగ వుంటాడు.

**శ్లో॥ యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయ్యమీ**
**యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః**

ఏది సమస్త ప్రాణులకు రాత్రిగా వుందో, అది యోగులకు పగలు. ఏదైతే సమస్త జీవులకూ జాగ్రదావస్థో అది ఆత్మజ్ఞానియైన మునికి రాత్రిగా వుంటుంది.

శ్లో॥ **పరోపకారే నిరతం స్వభావేన ప్రవర్తతే**
**యః స సాధురితి ప్రోక్తః ప్రమాణం త్వస్య చేష్టితమ్.**

తా:- ఎవడు సహజ స్వభావంలో నిరంతరం పరోపకార విషయాలలో ప్రవర్తిస్తాడో అతడే 'సాధువు' అని చెప్పబడుతుంది. అలాంటి వారి ఆచరణ సర్వజనులకూ ప్రమాణమై వుంది.

శ్లో॥ **అసమాధిః సమాధానం దుఃఖమేవ మహత్సుఖమ్**
**వ్యవహారోపి సన్మౌనం కర్మాణ్యేవాత్మ కర్మతా.**

అలాంటి జీవన్ముక్తుడైన జ్ఞానికి అసమాధియే సమాధి! దు:ఖమే మహా సుఖం! వ్యవహారమే ఉత్తమ మౌనం! కర్మలే మహా అకర్మత్వం !

శ్లో॥ **పశ్యన్కర్మణ్య కర్మత్వమకర్మణి చ కర్మతామ్**
**యథా భూతార్థచిద్రూపః శాన్తమాస్వ యథాసుఖమ్.**

కర్మలో అకర్మత్వాన్నీ, అకర్మలో కర్మత్వాన్నీ చూస్తూ, యదార్థ చిద్రూపస్థితి కలిగి శాంతంగా సుఖపూర్వకంగా వుంటాడు.

శ్లో॥ **అకస్మాత్తోపసంప్రాప్తా గ్రామయాత్రా యథాధ్వగైః**
**ప్రేక్షన్తే తద్వదేవ జ్ఞైర్వ్య వహారమయాః క్రియాః**

తా:- దారిలో అకస్మాత్తుగా తటస్థపడిన ఏదేని గ్రామం యొక్క వ్యవహారాలను బాటసారులు ఏ విధంగా రాగరహితులై చూస్తారో, ఆ విధంగానే జ్ఞానులు లోక వ్యవహారాలైన పనులను రాగరహితులై చూస్తారు.

శ్లో॥ **సర్వమేవాహమేతి తత్త్వజ్ఞోనావసీదతి**
**న గృహ్ణాతి పదార్థేషు విభాగానర్థభావనమ్.**

ఆత్మతత్వం తెలిసిన వాడు 'అంతా నేనే' అనే భావం కలిగి వుంటాడు. వేరు వేరుగా కనిపిస్తున్న వాటన్నిటి గురించి. నశించిపోయే దేహాలు గురించి విరుద్ధ భావాలు, అహంభావం లేనివాడై ఆనందాన్ని పొందుతాడు.

శ్లో॥ **ముక్తౌ రాఘవ లోకేస్మిన్నప్రాప్తిః సంభవత్యలమ్**
**అప్రవృత్తౌ వివేకస్య మగ్నాహి జనకోటయః**

ఓ రాఘవా! ఈ ప్రపంచంలో 'వివేకం' అనేది లేకపోతే 'ముక్తి' అనేది ఎప్పటికీ సంభవించదు. వివేకం లేకపోవడంవల్లే కోట్లాది జనులు ఈ సంసార భ్రమలో మునిగి వున్నారు.

**శ్లో॥ అనుకంప్యా భవిష్యన్తి శ్రీమన్తః సర్వ ఏవతే**
**దృష్టతత్త్వస్య తుష్టస్య జనాః పితురివావనౌ.**

తా:- లోకంలో తండ్రికి పిల్లలు ఏ విధంగా జాలి పొందదగిన వారవుతారో, అలాగే, ఆత్మతత్వం పొందిన మహాత్ముడికి మహా మహా శ్రీమంతులు కూడా జాలి పొందదగినవారే అవుతారు.

**శ్లో॥ హసన్న శాన్తయా వృత్త్యా ప్రాక్తనీర్గాగతీర్గతీః**
**స్మయమాన ఇవాస్తేన్తర్జనయశ్చ ఘనభ్రమాః**

తా:- జ్ఞాని తన పూర్వకాలంలోని సంసార స్థితిగతులను తలచుకుని ప్రశాంత వృత్తితో నవ్వుకుంటూ వుంటాడు. మరి ఘనీభూత అజ్ఞాన, భ్రమ యుక్తులై వున్న జనులను చూసి లోపల చిరునవ్వుతో వర్తిస్తాడు.

**శ్లో॥ భావాద్వైత ముపాశ్రిత్య సత్తాద్వైతమయాత్మకః**
**కర్మాద్వైతమనాదృత్య ద్వైతాద్వైతమయో భవ.**

ఆత్మజ్ఞాని కర్మలలో ద్వైతాన్ని ఆశ్రయించి, కేవలం భావంలోనే అద్వైతాన్ని ఆశ్రయిస్తాడు.

**శ్లో॥ పూర్ణేమనసి సంపూర్ణం జగత్సర్వం సుధాద్రవైః**
**ఉపానద్గూఢ పాదస్య నను చర్మాస్తృతైవ భూః**

మనస్సు ఆత్మతో పరిపూర్ణంకాగా, జగత్తు అంతా ఆనందామృత రసంతో పరిపూరితం అవుతుంది. ఏవిధంగా అంటే, "చెప్పులు తొడుక్కున్న వాడికి భూమి అంతా తోలుతో కప్పబడినట్లే కదా!"

**శ్లో॥ యథా మయోపదిష్టోసి యథా పశ్యసి శాస్త్రతః**
**యథానుభవసి శ్రేష్ఠమేకవాక్యం తథా కురు.**

ఓ రామచంద్రా! నేను నీకు ఏదైతే ఉపదేశించానో! శాస్త్రాల ద్వారా నువ్వు ఏదైతే తెలుసుకున్నావో! స్వానుభవంతో నువ్వు దేన్నైతే చూస్తున్నావో! ఈ మూడింటినీ ఒకే వాక్యంగా చేయాలి. (గురువాక్యం, శాస్త్రబోధ, స్వానుభవం అనే ఈ మూడూ ఏకార్థం కలిగి వుండటమే యథార్థ తత్త్వానుభవం యొక్క చిహ్నం).

పై శ్లోకం ద్వారా వశిష్ఠుల వారు బోధించేదేమిటంటే ఎవరైతే శాస్త్రాల ద్వారా అంటే స్వాధ్యాయం ద్వారా తెలుసుకున్నారో! గురువాక్యం అంటే సాంగత్యం ద్వారా తెలుసుకున్నారో! చివరకు సాధన ద్వారా అనుభవంలోకి తెచ్చుకుంటారు. అటువంటి వాడే ఆత్మానుభవం పొందినట్టు. అంటే ఆత్మజ్ఞానం

అనుభవపూర్వకంగా పొందినట్టు.

అలా ఎవరి ప్రవర్తన అయితే పూర్తిగా వశిష్ఠుల వారు బోధించినట్టు వుంటుందో, వారు 'ఆత్మజ్ఞానం' అనుభవపూర్వకంగా పొందినట్టే. అలా వారి ప్రవర్తనలో కొద్దిపాటి మార్పు వచ్చినా వారు సాధనలో పురోగతి సాధిస్తున్నట్టే. వారి సాధన సరైన క్రమంలో సాగుతున్నట్టే లెక్క. అటువంటి వారు సాధనను తీవ్రతరం చేసి ఆహార నియమాలు పాటిస్తూ స్వాధ్యాయ, సాంగత్యాలు క్రమం తప్పక చేస్తుంటే తప్పనిసరిగా ఈ జన్మలో 'పూర్ణజ్ఞానం' పొందే అవకాశం వుంది. అందుచేత వశిష్టుల వారు బోధించిన విధంగా కృషి చెయ్యండి, ఆత్మజ్ఞానులు కండి. ఆ విధంగా దుఃఖం నుండి శాశ్వతంగా బయటపడండి.

**అందుచేత తెలుసుకోండి మన జీవితం మనం చేసే కర్మలను బట్టి మాత్రమే వుంటుంది. కానీ మనం చేసే ఆరాధనలు బట్టి వుండదు.** కర్మలు మన యొక్క "జ్ఞానాన్ని, అజ్ఞానాన్ని" బట్టి వుంటాయి. అందుచేత ప్రతీ ఒక్కరూ అజ్ఞానాన్ని తొలగించుకోవాలి. ప్రవర్తన మార్చుకోవాలి. శ్రీ కృష్ణ భగవానుడు శ్రీ వశిష్ఠుల లాంటి వారు బోధించిన దానికి అనుగుణంగా మారాలి, ప్రవర్తించాలి. జీవించాలి. ఇది చాలా ముఖ్యం.

మరి 'అజ్ఞానం' తొలగించుకుని 'జ్ఞానం' పొందాలంటే మార్గమేది? దానికి ముఖ్యంగా **సాత్వికమైన శాకాహారం తీసుకుంటూ 'శ్వాస మీద ధ్యాస' వుంచి ధ్యానం చెయ్యాలి. వీలైనంత మౌనం పాటించాలి. పుస్తకాలు చదవాలి, జ్ఞానులతో సాంగత్యం చెయ్యాలి. వీలైనంత ధ్యానానికి, ఆత్మజ్ఞానానికి సంబంధించిన కార్యక్రమాలలో పాల్గొనాలి. సహకరించాలి అంటే సేవ చెయ్యాలి.** ఇవి తప్ప వేరే మార్గం లేదు. ఇవన్నీ ఆచరించిన వారే 'జ్ఞానం' సంపాదించుకోగలరు. 'ఆత్మజ్ఞానులు'లా ప్రవర్తించగలరు. సమస్యల నుండి, దుఃఖం నుండి శాశ్వతంగా బయట పడగలరు అంటే ముక్తిని పొందగలరు.

అందుకే పత్రీజీ అంటారు.

**"ధ్యానం వల్లనే జ్ఞానం – జ్ఞానం వల్లనే ముక్తి"**

అందుచేత **"ధ్యానం చెయ్యండి – ముక్తిని పొందండి".**

# " ప్రశ్నోత్తరోపనిషత్తు "

## " ధ్యానాతురుల ప్రశ్నలు .. పత్రీజీ పరిసమాధానాలు"

**ప్రశ్న : ఆధ్యాత్మిక మార్గంలో ' నిజమైనగురువు ' ను గుర్తించడం ఎలా ?**

**పత్రీజీ** : ' గురువు ' కానివాడు .. గురువుని గుర్తించడం అసంభవం ! ఏ జాతి పక్షులు ఆ జాతినే గుర్తించి ఆ జాతిలోనే సంచరించినట్లు .. **' గురువు '** ను గుర్తించగలిగిన వాడు మాత్రమే గురువుతో కూడి సంచరిస్తాడు.

గురువు కాని వాడికి గురువుల గుర్తులు చెప్పినా లాభం లేదు .. మరి గురువు అయిన వాడికి గురువుల గుర్తులు చెప్పడం అంతకంటే అనవసరం.

కాబట్టి **' నిజమైన గురువును గుర్తించడం ఎలా ? '** అని తికమకపడేకంటే ముందు ' నేను గురువును ఎలా కావాలి ?' అన్న ప్రయత్నం మొదలు పెట్టడం ముఖ్యం.

**ప్రశ్న : జీవితాన్ని మనం ఎలా ' సార్థకం ' చేసుకోవాలి ?**

**పత్రీజీ** : **' సార్థకం '** అంటే **'అర్థం తో కూడుకుని వున్నది'** అని అర్థం ! ' జీవితం ' అంటే మనిషి పుట్టుక నుంచి మరణం వరకూ వున్న దేశకాల పరిస్థితుల పరంపరలో కలిగిన స్పందన మరి ప్రతిస్పందనల ప్రవాహం.
కేవలం " ఒక గంటసేపో ఒక రోజులోనో .. ఒక ఊరిలోనో .. లేదా ఒక మనిషితోనో జీవితాన్ని అర్థవంతంగా జీవిస్తే .. అది కేవలం అంతవరకే సార్థకత. అలాకాక ప్రతిఒక్క దేశకాల పరిస్థితిలోనూ .. క్షణక్షణం సృజనాత్మకంగా, క్రియాశీలంగా, అర్థసహితంగా, దుఃఖరహితంగా మరి అందరికీ శ్రేయస్సును కలిగించే విధంగా ఉంటూ .. సత్యస్థితులై, ధర్మవర్తనులై .. ఆఖరి శ్వాస వరకు జీవిస్తే .. దానినే **' జీవితం యొక్క సంపూర్ణ సార్థకత '** అంటాం.
జీవితంలో ఇలాంటి సార్థకత ను పొందాలంటే .. మనం వదిలిపెట్టాల్సింది .. **' హింస '** మరి పట్టుకోవాల్సింది **' హంస '**.

**ప్రశ్న : మనకు మరో జన్మంటూ ఉంటుందా ?**

**పత్రీజీ** : " 190 లక్షల జన్మలు వుంటాయి .. లేదా 190 జన్మలే ఉండొచ్చు ! అది వాళ్ళ వాళ్ళ ఎంపిక ! నేను మీ ఊరికి ఎన్నిసార్లు అయినా రావచ్చు

.. రాకుండానూ వుండొచ్చు! అది నా ఎంపిక. జన్మతీసుకోవడం అంటే .. మీ ఊరికి రావడం లాంటిదే !

ప్రశ్న : **మీకు మొండి ధైర్యం ఎక్కువ ? !**

పత్రీజీ : నాకు మొండి ధైర్యం ఏమీ లేదు ! నేను కేవలం సత్యాన్ని గుర్తించాను .. మరి ఇది ' **సత్యం** ' అని అందరికీ చెపుతున్నాను. సత్యాన్ని ' **సత్యం** ' అని చెప్పడానికీ .. ఐస్‌క్రీమ్ ని ' **ఐస్‌క్రీమ్** ' అని చెప్పడానికీ మొండి ధైర్యం అక్కర్లేదు .. దానిని గురించిన సంపూర్ణ వాస్తవం తెలిస్తేచాలు. నాకు ' **సత్యం** ' ఏదో ' **అసత్యం**' ఏదో ఖచ్చితంగా తెలుసు .. కాబట్టే నేను అంత ఖచ్చితంగా ' సత్యం ' గురించి చెప్పగలుగుతున్నాను.

ప్రశ్న : **" బుద్ధత్వం అంటే ఏమిటి ? "**

పత్రీజీ : మనకు ప్రయోజనం లేని పనులు చేయకపోవడమే **బుద్ధత్వం.** అలాగే అవతలివారికి ప్రయోజనం లేని పనులను కూడా చేయకపోవడమే **బుద్ధత్వం.** మన జీవితావసరాలతో పాటు .. ఇతరుల అవసరాలను కూడా గుర్తించి చూడగలగడమే .. **బుద్ధత్వం !** బుద్ధితో కూడి మాట్లాడుతూ .. అన్నింటిలోనూ మితంగా వుండటమే **బుద్ధత్వం.** తిండి, నిద్ర, చదువు, సంపాదన, సేవ .. ఇలా అన్ని రకాల జీవన వ్యాపారాల్లో కూడా మధ్యేమార్గాన్ని అవలబించడమే .. **బుద్ధత్వం !!**

ప్రశ్న : **" మతబేధం అన్నది ఎందుకు వస్తోంది ?"**

పత్రీజీ : ఆత్మజ్ఞానలోపంతో కూడిన మూర్ఖత్వం వల్ల మానవుల్లో మతబేధం అన్నది వస్తోంది !

మనం ఒకానొక జన్మలో ' క్రిస్టియన్ ' గా, మరొక జన్మలో 'మహ్మదీయుడి' గా .. ఇలా అనేకానేక జన్మల్లో అనేకానేక రీతులలో పుడుతూంటాం ! కానీ పుట్టిన తరువాత ఆ ఆత్మ సత్యాన్ని మర్చిపోయి ..

" నేను కేవలం మహ్మదీయుడిని ", నేను కేవలం క్రిస్టియన్ని ", లేదా " నేను కేవలం హిందువుని " అన్న అజ్ఞానంలో పడి మనం మన జన్మపరంపరను మరిచిపోతూ మతబేధాల్లో ఇరుక్కుంటూ ఉంటాం. జన్మ పరంపరపట్ల మరి కర్మ సిద్ధాంతం పట్ల ఎరుకతో ఉండాలంటే .. తప్పనిసరిగా ధ్యానం చెయ్యాల్సిందే!!

ప్రశ్న : **" ఆత్మజ్ఞానాన్ని బోధించాల్సిన గురువులూ, స్వామీజీలు ' కాళ్ళు పట్టుకుంటే పది వేలు, ఇంటిని పావనం చేస్తే ఇరవై వేలు ' అంటూ భక్తులను దోచుకుంటున్నారు ?! దీనికి తరుణోపాయం లేదా ?**

పత్రీజీ : వాళ్ళు అలా రేట్లు పెట్టడంలో తప్పు లేదు కానీ .. మీరు అక్కడికి పోవడంలోనే తప్పువుంది ! వాళ్ళు మిమ్మల్ని దోచుకోవడం లేదు .. మీరే

దోచుకోబడుతున్నారు !

ప్రశ్న : " **దేవుడు కొంతమందిని ధనవంతులుగా, మరికొంత మందిని బీదవారుగా ఎందుకు పుట్టిస్తాడు ?** "

పత్రీజీ : ఎవ్వరూ, ఎవ్వరినీ పుట్టించరు. ఎవరికి వారే పుడతారు .. మరి అది వాళ్ళ వాళ్ళ వ్యక్తిగత ఎంపిక! ఇప్పటి జమీందారు ఒకప్పటి బికారే .. మరి ఇప్పటి బికారులందరూ ఒకప్పటి జమీందారులే ! ఈ జగత్తు అనే నాటకంలో ప్రతి ఒక్కరూ తమ తమ ఇష్టప్రకారమే జన్మలను తీసుకుంటూ .. ఒక్కొక్క జన్మలో ఒక్కొక్క పాత్రను పోషిస్తూ .. తద్వారా అనేకానేక జీవిత అనుభవాలను ప్రోగుచేసుకుంటూ ఉంటారు. కానీ ప్రాపంచిక మాయలో పడిపోయి తరచు ఆ విషయాన్ని మర్చిపోతూంటారు.

ప్రశ్న : " ' **పండితులు** ' **అంటే ఎవరు ?** "

పత్రీజీ : ' **ఆత్మజ్ఞానం** ' తో పండిపోయిన వారిని
' **పండితులు** ' అంటాం ! ఏ విషయానికీ ఏడవని వాడు ; సృష్టిలో ఉన్న అన్నింటిపట్ల సమదృష్టితో వున్నవాడు ; మానం వచ్చినా, అవమానం వచ్చినా చలించనివాడు ; విజయం వచ్చినా అపజయం వచ్చినా సవినయంగా స్వీకరించేవాడే ' పండితుడు '.

ప్రశ్న : " **ఈ మధ్య ఎక్కడ చూసినా ఆధ్యాత్మికతతో కూడిన జీవితం గురించిన చర్చలు ఎక్కువైపోయాయి ! అసలు ' ఆధ్యాత్మికత ' అంటే ఏమిటి ?** "

పత్రీజీ : ' **ఆధ్యాత్మికత** ' అంటే .. గుళ్ళకు వెళ్ళి దేవుళ్ళను పూజించడం కాక .. " **మనమే దేవుళ్ళం** " అని తెలుసుకోవడమే ! " మనమే దేవుళ్ళం " అన్న సత్యాన్ని తెలుసుకుని ఆ తరువాత " **అందరూ దేవుళ్ళే** " అన్న సత్యాన్ని తెలుసుకుంటూ అందరినీ గౌరవించడమే ' **ఆధ్యాత్మికత**'. సకలవిద్యావిషయసంపన్నుడైన పండితుడినీ .. మరి ఏ విద్యా నేర్వని పామరుడినీ కూడా సరిసమానంగా గౌరవించడమే '**ఆధ్యాత్మికత**'. దైనందిన జీవితంలో అత్యంత చైతన్యవంతంగా వుంటూ ప్రతిక్షణంలోని ఆనందాన్ని ఆస్వాదించడమే ' **ఆధ్యాత్మికత** '.

ప్రశ్న : " ' **ఎన్‌లైటెన్‌మెంట్** ' **అంటే ఏమిటి ?** "

పత్రీజీ : మన జన్మకు కారణం అయిన మహదాశయాన్ని ఎరుకలోకి తెచ్చుకుని .. తదనుగుణంగా ప్రయత్నాలు చేస్తూ .. లోకకల్యాణార్థం ఆ మహాకార్యాన్ని పూనికతో నెరవేర్చగటగడమే ' ఎన్‌లైటెన్‌మెంట్ '. ఇలా మనలోని దివ్యత్వాన్నీ మరి నిజాయితీనీ అత్యంత విశ్వాసంతో దర్శించే తత్వమే ' ఎన్‌లైటెన్‌మెంట్ '.

పశ్న : " ' **సన్యాసం** ' **అంటే ఏమిటి ?** "

**పత్రీజీ** : **" సమ్యక్ " = సరియైన విధంగా**
**" న్యాసం " = ( వదిలిపెట్టాల్సిన వాటిని ) వదిలిపెట్టడం**
" నేను వేరే .. నువ్వు వేరే " అన్న భావాన్ని .. సంపూర్ణంగా వదిలిపెట్టగలగడమే **" సన్యాసం ".**

**ప్రశ్న** : **" ' సైన్స్ చెప్పేది సత్యం ' అని నిర్ధారించుకోవచ్చా ?"**

**పత్రీజీ** : కంటికి కనిపించేది కొంతవరకే విశ్లేషించి చెప్పే ' సైన్స్ ' .. కొంతవరకే మనకు విషయ పరిజ్ఞానాన్ని కలుగుజేస్తుంది .. అంతమాత్రాన అదే **' సత్యం '** కాజాలదు. ఉదాహరణకు కాంతి పరావర్తనం చెందినప్పుడు కనిపించే వర్ణపటంలో .. ఎరుపు వర్ణం నుంచి నీల వర్ణం వరకు ఉన్న కిరణాలను మాత్రమే 'సైన్స్ ' మనకు చూపిస్తుంది. కానీ కాంతిలో ఇంకా మన కంటికి కనిపించని అల్ట్రా వయొలెట్, ఇన్‌ఫ్రారెడ్ కంటే మించిన 190 లక్షల పౌనఃపున్యపు పరిధుల్లోని కిరణాలు కోకొల్లలుగా వున్నాయి. అవన్నీ ' సైన్స్ ' మనకు చూపించ లేకపోవచ్చు కానీ **' ధ్యానం '** మన దివ్యచక్షువుకి అన్నీ సుస్పష్టంగా చూపిస్తుంది .. మరి వాటిని గురించిన సంపూర్ణజ్ఞానాన్ని మనకు అందిస్తుంది !

**ప్రశ్న** : **" గౌతమబుద్ధుడు తన జాతకరీత్యా యోగీశ్వరుడయ్యాడా? లేక .. "**

**జవాబు** : గత అనేకానేక జన్మలనుంచే .. గౌతమబుద్ధుడు గొప్ప యోగీశ్వరుడు ! అయితే ఇక్కడ మనం తెలుసుకోవలసిన ముఖ్యవిషయం .. " గౌతముడిలా మనం ఎప్పుడు యోగీశ్వరులం అవుతాము ? ఒకానొక బుద్ధుడిలా మనం ఎలా జీవించగలుగుతాము ?" అన్నదే కానీ మరింకోటి కాదు ! అనేకానేక మంది యోగీశ్వరులు మనకు అందించిన అనుభవపరమైన శాస్త్రీయ ఆత్మజ్ఞానాన్ని అందుకుంటూ దానిని మన స్వీయ అనుభవజ్ఞానంలా పలుచుకోవడమే మనం చెయ్యాల్సిన పని కానీ .. వాళ్ళ జాతకాలను విశ్లేషించుకుంటూ కూర్చోవడం వల్ల మనకు జరిగేదేమీ వుండదు.

**ప్రశ్న :** **" ఇంటగెలిచి రచ్చగెలవమని పెద్దలు చెప్తారు .. అది ఎలా ?"**

**జవాబు:** **ధ్యానం, సజ్జన సాంగత్యం, స్వాధ్యాయం** అన్నవి మూడూ కలిసిన **" ఆధ్యాత్మిక జీవితం 50 శాతంగా "** ఉన్నప్పుడే **" మిగతా 50 శాతం ప్రాపంచిక జీవితం"** అన్నది సమత్వపు స్థితిలో సాగుతుంది.
" ఆత్మ ఇంట " గెలిచిన ఒకానొక బుద్ధుడు మాత్రమే " ప్రాపంచిక రచ్చ " లో కూడా గెలుస్తూ సమత్వపు స్థితిలో తన జీవితాన్ని సంపూర్ణంగా జీవిస్తూంటాడు !

**ప్రశ్న :** **" ఇప్పుడు ఎక్కడ చూసినా ఇబ్బడి ముబ్బడిగా ఆధ్యాత్మిక సంస్థలు పుట్టుకొస్తున్నాయి. వీటిల్లో ఏది నాకు సరిఅయినదో ఎంపిక చేసుకోడానికి**

**ఏదయినా Short-Cut పద్ధతి ఉందా ?!**

**జవాబు : "Short-Cut"** అన్నది ఎక్కడా లేనేలేదు !

ఒక్కొక్క పద్ధతినీ నిశితంగా పరీక్షిస్తూ వెళ్ళాల్సిందే ! .. దీనికి ఎంతో సహనం వుండాలి. గౌతమబుద్ధుడు ఆరేళ్ళపాటు విసుగు విరామం లేకుండా సుమారు 500 మంది గురువుల దగ్గర శిష్యరికం చేశాడు. అక్కడ తాను గ్రహించిన విషయాలన్నింటినీ ఆచరించి ఆ అనుభవజ్ఞానాన్నంతా క్రోడీకరించుకుంటూ చివరికి తనదైన **ఆనాపానసతి** దారిని ఎన్నుకున్నాడు. గౌతమబుద్ధునికైనా .. మరెవరికయినా **"సునాయాస – చిట్కా పద్ధతులు"** అంటూ ఏవీ లేవు !

**ప్రశ్న : " గురువుగారూ ! సత్యయుగం మొదలైనట్లేనా ?! "**

**జవాబు :** భిన్నత్వంతో కూడిన ఈ సృష్టిలో ఏదీ అందరికీ ఒకేలా ఉండదు ! మీకు సత్యయుగం మొదలై మీ ఇంట్లో వాళ్ళు ఇంకా కలియుగంలోనే ఉండవచ్చు ! లేదా మీ వాళ్ళంతా సత్యయుగంలోకి వెళ్ళిపోయి మీరు ఇంకా కలియుగంలోనే కొట్టుమిట్టాడుతూ ఉండవచ్చు !

**ప్రశ్న : " జీవితాన్ని ఎలా జీవించాలి ?! "**

**పత్రీజీ :** " ఈ జన్మ మనకు తెలియకుండా అకస్మాత్‌గా జరిగిన సంఘటన ఎంతమాత్రం కానేకాదు " అన్న సత్యాన్ని మనం తెలుసుకుని జీవితం గురించి నిరంతరం జాగ్రత్తగా ఆలోచించాలి. మన స్వంతఇచ్ఛతో ఏరుకుని, కూర్చుకున్నటువంటి అత్యంత ప్రణాళికాబద్ధమైన మన జీవితాన్ని అజ్ఞానంతో, మూర్ఖత్వంతో దుర్భరం చేసుకోకుండా ప్రతిక్షణం ఆత్మజ్ఞానపు ఎరుకతో జీవిస్తూ దానిని " **చాన్నాళ్ళ అద్భుతం** " లా మలచుకోవాలి !

**ప్రశ్న : " మరణం తరువాత ఆత్మకు ఏమవుతుంది ? "**

**పత్రీజీ :** ఏమీ కాదు !! మీ శరీరం మీద నుంచి చొక్కా తీసేసినప్పుడు మీ శరీరానికి ఏమవుతుంది ? అలాగే .. మరణం తరువాత తాత్కాలికమైన శరీరాన్ని ధరించి వున్న శాశ్వతమైన ఆత్మకు కూడా ఏమీకాదు ! శరీరానికి బట్ట ఎలాంటిదో .. ఆత్మకు శరీరం అలాంటిదే కనుక మరణం ద్వారా శరీరం నశించిన తరువాత కూడా ఆత్మ మరిన్ని అనుభవాలకోసం మరిన్ని జన్మలను తీసుకుంటూ మరిన్ని క్రొత్తక్రొత్త శరీరాలను ధరిస్తూ తన అనంతకాల ప్రయాణాన్ని కొనసాగిస్తూనే వుంటుంది.

**ప్రశ్న : " అందరూ ' దేవుడు ఉన్నాడు ' అంటున్నారు కదా ! అసలు దేవుడిని చూడడం ఎలా ?! "**

**పత్రీజీ : సర్వం ఖల్విదం బ్రహ్మ ..** కనపడేదంతా దేవుడే ! అందరూ దేవుళ్ళే !

" నేను ప్రతిక్షణం .. ప్రతి ఒక్క దేవుడినీ చూస్తున్నాను; ప్రతి ఒక్క దేవుడితో

మాట్లాడుతున్నాను" అన్న సత్యాన్ని మరిచిపోయిన దేవుళ్ళంతా కూడా విజయవాడ నుంచి తిరుపతికీ .. కోదాడ నుంచి షిరిడీకీ వెళ్ళి " దేవుడెక్కడా?" " దేవుడెక్కడా ? " అని దేవులాడుతున్నారు !

ప్రశ్న : **" క్లిష్టమైన పరిస్థితుల్లో ఎలా రియాక్ట్ కావాలి ?"**

పత్రీజీ : **REACTION** చెందేవాడు పురుషాధముడు
**CREATION** చేసేవాడు పురుషోత్తముడు.
**"REACTION"** అన్న ఆంగ్ల పదంలోని అక్షరాలను మరోవిధంగా కూర్చి తెలుసుకుంటే **"REACTION"** అని వస్తుందిగదా ! కాబట్టి నో రియాక్షన్ !! " **కరుణ**" ను చూపించాలి ; " **కరుణ** " ను " **సృష్టించి** ", **ఆచరించి,** చూపించాలి. నా వ్యక్తిత్వాన్ని ఉన్నతీకరించుకోవడానికి నేను నా జీవితంలో ఈ సూత్రాన్నే అనుసరిస్తున్నాను.

ప్రశ్న : **" ఓ ఎన్‌లైటెన్డ్ మాస్టర్‌ను గుర్తించడం ఎలా ?"**

పత్రీజీ : ఎన్‌లైటెన్డ్ మాస్టర్‌ను గుర్తించడం చాలా సులభం ! అతడు తన జీవితాన్ని చక్కగా అర్థం చేసుకుని మరీ జీవిస్తూంటాడు. అతడు కష్టాలకు కృంగిపోడు ; బాధలకు తలవంచడు. అందరితో మమేకం అవుతూ అందరినీ సరిసమాన స్నేహదృష్టితో చూస్తూ .. ఎవరు తనను పొగిడినా పొంగిపోకుండా, దూషించినా బాధపడకుండా .. ఒక బుద్ధుడిలా సదా బ్రహ్మానందస్థితిలో వుంటాడు.

ప్రశ్న : **" ప్రకృతితో కలిసి జీవించడం ఎలా ? "**

పత్రీజీ : ప్రకృతి రెండు పార్శ్వాలుగా వుంటుంది.
**స్థూల ప్రకృతి ..** చర్మచక్షువులతో చూసేది.
**సూక్ష్మ ప్రకృతి** .. దివ్యచక్షువులతో చూసేది.
ఒకే జీవిత కాలంలో ఈ రెండు పార్శ్వాలతో కూడిన ప్రకృతితో విశేషంగా కలిసి జీవించడమే .. శాస్త్రీయమైన జీవనవిధానం.
చర్మచక్షువులతో చూడగలిగిన స్థూలప్రకృతి అయిన కొండ + కోనలు .. చెట్టు + చేమలు .. పక్షులు + జంతువులు .. నదులు + సెలయేళ్ళు .. స్వచ్ఛమైన గాలి + సముద్రాలు వంటి శక్తి క్షేత్రాలలో సమయం గడుపుతూ వాటి నుంచి ఇతోధికంగా విశ్వమయప్రాణశక్తిని పొందాలి.
ధ్యానం ద్వారా దివ్యచక్షువును ఉత్తేజపరచుకుని మామూలు చర్మచక్షువులతో చూడలేని సూక్ష్మకారణ, మహాకారణ వంటి అనేకానేక ఉన్నత లోకాలను దర్శించి .. ఆ యా లోకాల నుంచి విశ్వశక్తినీ, ఆ యా లోకాల భావసంపద నూ గ్రహించి నూతన ఔన్నత్యంతో కూడిన మనోవికాసాన్ని పొందాలి.
ఇలా స్థూల, సూక్ష్మ ప్రకృతులతో కూడి శాస్త్రీయ పద్ధతిలో ఏకకాలంలో

జీవించగలిగినప్పుడే మనం విశ్వజీవులుగా పరిణమిస్తాం !

**ప్రశ్న** : **" ఆనందం ఎలా వస్తుంది ? "**

**పత్రీజీ** : మనసా, వాచా, కర్మణా త్రికరణశుద్ధిగా, నిజాయితీగా ఉన్నప్పుడు మనకు ఆనందం అన్నది విశేషంగా లభ్యం అవుతూ వుంటుంది. ధ్యాన అనుభవం ద్వారా మనం తెలుసుకున్నదానినే మాట్లాడుతూ .. అలా మాట్లాడిన దానినే ఆచరిస్తూ .. నిత్య ఎరుకతో ఉన్నప్పుడు మనం ఆనందమయులుగా ఉంటాం.

ఈ నిత్య జీవన ఆనందమయ సూత్రాన్ని పిల్లలకూ, పెద్దలకూ, బంధువులకూ మరి మనల్ని శత్రువులుగా చూస్తున్నవాళ్ళకు కూడా అందజేస్తూ వారిని కూడా ఆనందమయుల్లా మలుస్తూ ఉంటే మనం బ్రహ్మానందంతో విలసిల్లుతూ ఉంటాం.

**ప్రశ్న** : **" యోగభ్రష్టత్వం అంటే ఏమిటి ? "**

**పత్రీజీ** : సరియైన ధ్యాన సాధనను విశేషంగా చేసిన ప్రతి ఒక్కరికీ అపరిమితమైన శక్తిసామర్థ్యాలు సంక్రమిస్తూ ఉంటాయి. తద్వారా వారు ఏది కోరుకుంటే అది ప్రాపంచికంగానే కాకుండా ఆధ్యాత్మికంగా కూడా సునాయాసంగా కలిసివస్తూ ఉంటాయి.

**" ప్రాప్తి "** .. **" ప్రకామ్యం "** .. **" ఈశత్వం "** ..

**" వశిత్వం "** అనబడే ఇలాంటి సిద్ధుల వల్ల మనంగర్వం, అహంకారం మరి దంబాతిశయాలను పెంచుకుంటే .. అది మన ఆధ్యాత్మిక మరి ప్రాపంచిక పతనాలకు దారితీసి మనల్ని యోగభ్రష్టుల్లా మలిచి మరు జన్మలో మరింత క్లిష్టపరిస్థితుల్లో జన్మతీసుకునేలా చేస్తుంది.

అలా కాకుండా నిరంతర ధ్యాన సాధన ద్వారా మనకు సంక్రమిస్తోన్న సిద్ధుల పట్ల ఎరుకతో కూడిన సమదృష్టిని కలిగి ఉండాలి ! కోరుకున్నవైనా .. లేదా అనాలోచితంగా నైనా సరే .. మనకు సంప్రాప్తిస్తోన్న అద్భుత ఫలితాల పట్ల కృతజ్ఞతతో కూడి ఉంటూ గర్వానికి లోబడిపోకుండా జాగ్రత్త వహించాలి. అప్పుడే ఆత్మ తన పరిణామ క్రమంలో ముందుకు వెళ్తూ వుంటుంది.

**ప్రశ్న** : **" గురువు యొక్క అవసరం ఎంత వరకు ? "**

**పత్రీజీ** : పరిమితమైన ఆలోచనలతో కూడిన ప్రాపంచిక మాయలోంచి బయటపడేంత వరకూ మనకు బాహ్య గురువుల సూచనలూ, సలహాలూ అవసరం ! ధ్యాన సాధన ద్వారా మనల్ని మనం సంపూర్ణంగా అర్థం చేసుకున్నప్పుడు స్వయంప్రకాశంతో కూడిన గురువుల్లా మనకు మనమే మార్గదర్శనం చేసుకుంటాం. ఇందుకు స్వాధ్యాయం, సజ్జన సాంగత్యాదులు

మనకు ఇతోధికంగా సహాయపడతాయి!

**ప్రశ్న :** **" ఆచార్యుడు అంటే ఎవరు ? "**

**పత్రీజీ :** **" యః యాచినోతి, ఆచరతి, ఆచారయతి చ .. సః ఆచార్యః" అన్నది శాస్త్రం !**

అనేకానేకమంది గురువుల దగ్గర ఆత్మజ్ఞానాన్ని యాచించి, యాచించి పొంది .. అలా యాచించి, యాచించి పొందిన దానిని సాధన ద్వారా తన **స్వానుభవం** గా మార్చుకుని .. తాను చేసిన ఆ ఆత్మాభ్యాసాన్నే ఇతరుల చేత కూడా చేయించేవాడే **ఆచార్యుడు !**

ఈ భూమి మీద జన్మతీసుకున్న ప్రతి ఒక్కరూ ఆచార్యుడు కావడానికి ప్రయత్నించాల్సిందే .. మరి ఆచార్యుడిగా అయ్యేంత వరకు తిరిగి తిరిగి ఇక్కడ పుట్టాల్సిందే !

**ప్రశ్న :** **" ' స్వేచ్ఛ ' ను నిర్వచించండి ! "**

**పత్రీజీ :** **స్వ = స్వంత.. ఇఛ్ఛ = కోరిక .. " స్వేఛ్ఛ "** అంటే మన **"స్వంత ఇఛ్ఛ"!**

" మనం ఎక్కడ వున్నా, ఏ లోకంలో తిరిగినా మన వాస్తవాన్ని మన స్వంత కోరికల ప్రకారం మనమే సృష్టించుకుంటున్నాం " అన్న ఆత్మజ్ఞానపు ఎరుకతో సదా ఆనందంగా జీవించడమే స్వేచ్ఛ !

**ప్రశ్న :** **" కర్మయోగం అంటే ఏమిటి ? "**

**పత్రీజీ :** మనం చేయవలసిన కర్మలను గుర్తించి వాటిని శ్రద్ధగా చేయడానికి ప్రయత్నించడమే **" కర్మయోగం "** !

మనం చేస్తున్న వృత్తుల మీద గౌరవభావాన్ని కలిగి వుండడమే .. " **కర్మయోగం** " !

సమయాన్ని దుర్వినియోగం చేయకుండా అనేకానేక సుకర్మల్లో మనల్ని మనం ఎప్పటికప్పుడు నియమించుకోవడమే .. **" కర్మయోగం " !**

రకరకాల విద్యలనూ, కళలనూ సదా నేర్చుకుంటూ వుండడమే ..
**" కర్మయోగం " !**

సంసార చక్రంలో పైన వున్నప్పుడు మిడిసిపడకుండా .. క్రింద వున్నప్పుడు క్రుంగిపోకుండా స్థిరచిత్తంతో ధైర్యంగా నిలబడగలగడమే ..
**" కర్మయోగం " !**

కర్మఫలితం మీద ఎక్కువగా ఆధారపడకుండా కర్మచేయడంలో మాత్రమే శ్రద్ధగా నిమగ్నమై ఉండడమే **" కర్మయోగం"!**

మన ఆలోచనలూ, మాటలూ, చేష్టలూ.. అన్నింటి పట్ల సమయ సందర్భాలను అనుసరించి జాగరూకులుగా వుండడమే.. **"కర్మయోగం"!**

ప్రతి కర్మ కూడా మరొక కర్మకు కారణభూతమవుతుందన్న **కార్యకారణ సంబంధాన్ని** అర్థం చేసుకుని కర్మచక్రాన్ని జాగరూకతతో పరిశీలించడమే .. **" కర్మయోగం " !**

" చేసుకున్న వాడికి చేసుకున్నంత " అన్న సిద్ధాంతాన్ని అర్థం చేసుకుని ఆ పరిధిలో జీవించడమే **" కర్మయోగం "!**

**ప్రశ్న : " తప్పులను ఎలా సరిదిద్దుకోవాలి ? "**

**పత్రీజీ :** ప్రతి మనిషి కూడా తన ప్రగతి పథంలో తప్పులు విధిగా చేస్తూనే ఉంటాడు. అయితే వాటిని నడకనేర్చుకోవడంలో దొర్లే చిన్ని చిన్ని తప్పటడుగుల్లాగానే గుర్తించాలి ! అంతేకాక ఒకవేళ నిజంగా తప్పు జరిగినా కూడా దానిని మరచిపోయి మళ్ళీ వెంటనే క్రొత్త క్రొత్త సృజనాత్మక కార్యక్రమాల్లో మునిగిపోవాలి.

" నేను పాపిని .. నేను పాపిని " అని పదే పదే అనుకుంటూ ఆత్మనూన్యతకు గురికావడం కానీ ..

" నువ్వు పాపివి .. నువ్వు పాపిని " అంటూ మరొకరిని నిందించడం కానీ చెయ్యకూడదు. తప్పులు చేస్తున్న వాళ్ళ దగ్గరి నుంచి కూడా సదా పాఠాలు నేర్చుకోవడమే మనం చెయ్యవలసిన పని.

**ప్రశ్న : " సజ్జన సాంగత్యానికీ, ఆచార్యసాంగత్యానికీ తేడా ఏమిటి? "**

**పత్రీజీ : " సజ్జన సాంగత్యం "** అంటే **" ' సత్యం ' తెలుసుకున్న వారితో కలిసి ఉండడం "** .. అంటే ఆత్మవిద్య గురించీ, ఆత్మశక్తి గురించీ స్పష్టమైన అవగాహన కలిగి ఉన్న సజ్జనులతో కూడిన సాంగత్యం!

**" ఆచార్యులు "** అంటే **" తాము తెలుసుకున్న సత్యంలో సదా జీవిస్తూ తమతమ జీవితాలను మరింత సత్యసాధనకే అంకితం చేసినవారు, చేస్తున్నవారు.** ఆధ్యాత్మికతలో పరిపూర్ణ ప్రగతిని సాధించిన ఇలాంటి ఆచార్యులతో కలిసిమెలిసి జీవించడమే **" ఆచార్య సాంగత్యం ".**

ప్రతిఒక్క సాధకుడు కూడా ధ్యానంతో పాటు **" సజ్జన సాంగత్యం "** మరి **" ఆచార్యసాంగత్యం "** అన్నవి విధిగా చెయ్యాలి. అప్పుడే అతని ఆత్మ ప్రగతిపథంలో ముందుకు నిశ్చింతగా సాగిపోతూ వుంటుంది.

**ప్రశ్న : " బుద్ధుడి మూర్తులను .. కూర్చున్న భంగిమలో, నిలుచున్న భంగిమలో మరి పడుకున్న భంగిమలో చూస్తూంటాం ! వాటి అంతరార్థాలు ? "**

**పత్రీజీ :** ధ్యానస్థితిలో కూర్చుని వున్న బుద్ధమూర్తి .. **" ధ్యానం ద్వారా జ్ఞానం "** అన్న **శివ పార్వతీ తత్వాన్ని** సూచిస్తూ వుంటుంది.

నిశ్చలంగా నిలబడి వున్న బుద్ధమూర్తి .. కార్యోన్ముఖతకూ, సృజనాత్మకతకూ ప్రతిరూపంగా వున్న **బ్రహ్మావాగేశ్వరీ తత్వాన్ని** సూచిస్తుంది.

ఇక పడుకుని ఉన్న బుద్ధమూర్తి .. పాలసముద్రంలో యోగనిద్రాపరవశుడై ముక్తస్థితిలో వున్న **విష్ణుతత్వాన్ని** సూచిస్తుంది.

ప్రశ్న : **" జీవన్ముక్తుడు ఎలా ఉంటాడు ? "**

పత్రీజీ : **దేనికీ తాపత్రయపడని ప్రశాంత నిర్మల తత్వంతో బుద్ధి పరిణితిని సాధించి** ఉన్నవాడే **" ఒకానొక జీవన్ముక్తుడు"**; అలాంటి నిష్కామ నిశ్చలమూర్తి అయిన జీవన్ముక్తునికి సిరి దాస్యం చేస్తుంది.. విజయం కోరి తలుపు తడుతుంది.

అన్నింటా తృప్తులై ఉన్న జీవన్ముక్తుల వాక్కులూ, కర్మలూ ఆత్మహితకరాలుగా, లోకహితకరాలుగా విరాజిల్లుతూ వుంటాయి.

ప్రశ్న : **" మా తల్లిగారు ఇటీవలే చనిపోయారు ; అందుకు నాకు చాలా బాధగా వుంది .. "**

పత్రీజీ : **' చనిపోవడం '** అన్నది కొంపలు అంటుకునే వ్యవహారం ఎంతమాత్రం కాదు ! అది **' ఒక కొంప '** నుంచి **' మరొక కొంప'** కు .. **'ఒక స్థానం'** నుంచి **'మరొక స్థానం'** కు.. **' ఒక దేశం'** నుంచి **' మరొక దేశానికి '** మారే సర్వసాధారణమైన కార్యక్రమం!

అందరూ ఎందుకు చనిపోతున్నారో మీ తల్లిగారు కూడా అందుకే చనిపోయారు ; కాబట్టి ఇప్పుడు మీరు వారు **చనిపోయినందుకు బాధపడకుండా ..** అసలు వారు చనిపోయి ఎక్కడికి వెళ్ళారో .. మరి మీ తల్లి గారిలాగే అందరూ చనిపోయి ఏ ఏ లోకాలకూ వెళ్ళి మళ్ళీ మళ్ళీ వస్తున్నారో .. ఆ ప్రదేశాల గురించి, మరి ఆ యా లోకాల గురించి కూలంకషంగా విచారించండి ; మరి **మరణానంతర జీవితం** గురించి అధ్యయనం చేయడం వెంటనే ప్రారంభించండి !

ప్రశ్న : **" ' తడిసి మోపెడు ' అని తరచూ వింటూంటాం .. "**

పత్రీజీ : **' గుప్పెడు ' – ' మోపెడు '** అన్నవి తెలుగుభాషలో వున్న రెండు పదాలు. ఏదైనా సరే తడవకపోతే చేతిలో పట్టుకోగలిగినట్లు **' గుప్పెడే '** కానీ అవి తడిసినప్పుడు మాత్రం తలపై మోయలేనంత బరువెక్కి **'మోపెడు'** అవుతాయి !

పుట్టుకతో మనం తెచ్చుకునే కర్మలు ఎప్పుడూ **గుప్పెడే** వుంటాయి ! అయితే జీవనగమనంలో మనమే వాటిని తడుపుకుని అంటే అజ్ఞానంతో పెంచుకుని **' మోపెడు '** చేసుకుని బెంబేలెత్తి పోతూంటాం !

ధ్యానం అనునిత్యం చేసుకుంటూ .. **మరి శారీరక బాధలను కాస్త ఓర్చుకుంటూ ఓపిక** పడితే గుప్పెడు రోగాలు.. కష్టాలు.. సునాయాసంగా సమసిపోతాయి ! అలా కాకుండా .. " ఆ డాక్టర్ .. ఈ మందు " .. "

ఆ దేవుడు .. ఈ మంత్రగాడు" అంటూ అసహనంతో పరుగులు పెడితే అవి తడిపి మోపెడు అవుతాయి.

**ధ్యానులు, ఆత్మజ్ఞానులు అయిన వారు** ఆ **" కాసిని – గుప్పెడు"** కష్టాలను ఓర్పుతో తేలిగ్గా అధిగమిస్తూ సదా ఆనందంగా జీవించగలుగుతారు.

మయసభలో ద్రౌపది నవ్వుతో భంగపాటు చెందిన దుర్యోధనుడు ఆ విషయాన్ని అక్కడితో వదిలివేయకుండా పదే పదే ఆలోచిస్తూ .. **" నాకు ఇంత అవమానమా ? " .. " నేను ఇంత లోకువా ? "** అని ఆ విషయాన్ని తడుపుకుని తడుపుకుని **మోపెడంత** చేసుకుని .. మహాభారత మహాయుద్ధాన్ని సృష్టించి .. అందరి వినాశనానికి కారణభూతుడయ్యాడు!

**ప్రశ్న :** **" 'శివుడికి ఇద్దరు భార్యలు' అని పురాణాల్లో వింటూంటాం ! నిజమేనా?!"**

**పత్రీజీ :** నిజమే ! శివుడికి ఇద్దరు భార్యలు ఉన్నారు ! మొదటి భార్య **"పార్వతి"** అయితే .. రెండవ భార్య **" ఆకాశగంగ " ! పార్వతి** అంటే **ప్రాపంచికత .. ఆకాశగంగ** అంటే **ఆధ్యాత్మికత.**

ఇలా ఇద్దరు భార్యలతో కూడి శివుడు .. కైలాసంలో సదా **ఆనంద తాండవం** చేస్తూ వుంటాడు.

శివుడిలాగే ప్రతి ఒక్కరి జీవితంలో కూడా మొదటి భార్య **"ప్రాపంచికత"** తోపాటు .. రెండవ భార్య **"ఆధ్యాత్మికత"** కూడా వుండితీరాలి ! అప్పుడే వారు శివుడిలా ప్రతిక్షణం ఆనందంగా ఉంటారు. **కేవలం ప్రాపంచికత** మీదగానీ .. **కేవలం ఆధ్యాత్మికత** మీదగానీ ఆధారపడి బ్రతికేవాళ్ళ జీవితంలో **ఆనందం** అన్నది **యాభై శాతం** మాత్రమే వుంటుంది.

అలా కాకుండా నూటికి నూరు పాళ్ళు ఆనందంగా జీవించాలంటే పగలు ప్రాపంచికమైన జీవన వ్యాపారాలను ధర్మబద్ధంగా సాగించుకుంటూనే .. రాత్రి **ఆనాపానసతి ధ్యానసాధన** విధిగా చెయ్యాలి .. ఆధ్యాత్మిక రహస్యాలన్నింటినీ ఔపోసన పట్టాలి .. మరి **సంసారంలో** వుంటూనే **నిర్వాణం** చెందాలి. ఇదే ఇద్దరు భార్యలతో కూడిన శివతత్త్వంలోని పరమార్థం !

**ప్రశ్న :** **" ' కలిసి ఉంటే కలదు సుఖం ' అన్నది పెద్దల మాట ! అయితే ఎవరితో కలిసి వుండాలి ? "**

**పత్రీజీ :** మన **స్వంత** ఆత్మతో సదా కలిసి వుండాలి .. ఆత్మజ్ఞాన పరమరహస్యాలతో కలిసి వుండాలి .. ఆత్మజ్ఞాన పరాయణులతో కలిసి వుండాలి .. పిరమిడ్ శక్తితో కలిసి వుండాలి.

ప్రశ్న : " ముఖాన పులుముకునే ' నిలువు నామాలు ',
' అడ్డనామాలు ' అన్నవి ఆధ్యాత్మికతకు చిహ్నాలుగా చెప్పుకోవచ్చా ?! "

**పత్రీజీ :** అసలు **"నామాలు"** అన్నవి తీసివేయడమే ఆధ్యాత్మికత!
**"నామాలు"** అంటే బాహ్యంగా ముఖం మీద పులుముకునే అలంకార ప్రాయాలు కావు అవి **'నా'** శరీరం... **'నా'** ఇల్లు ... **'నా'** పిల్లలు .. **'నా'** పొలం.. **'నా'** వ్యాపారంతో పాటు ... **'మా'** జాతి ..**'మా'** వర్గం .. **'మా'** కులం .. **'మా'** దేశం .. అంటూ మానవ జాతికి పట్టిన చీడ పీడలు!
ఆధ్యాత్మిక విజ్ఞానశాస్త్రం మనల్ని **'నా', 'మా'** అన్న చీడ పీడల నుంచి వేరు చేసి **"మన"** అన్న విశాల సృష్టితత్వంతో వికసించేటట్లు చేస్తుంది.

**ప్రశ్న : ఆత్మ .. " పురోగమన దిశ " లో ఉందని తెలుసుకోవడం ఎలా ?**

**పత్రీజీ :** " ఆత్మ యొక్క పురోగతి " అన్నది .. ఆ ఆత్మ తన జీవితకాలంలో తాను స్వయంగా ఎంపిక చేసుకున్న రకరకాల భౌతిక మరి ఆధ్యాత్మిక ప్రయత్నాల యొక్క విశాల సంఖ్యపై ఆధారపడి ఉంటుంది. ఆయా ప్రయత్నాల యొక్క " తుది ఫలితం " అన్నది జయం కావచ్చు లేదా అపజయం కావచ్చు కానీ .. పురోగమనం మాత్రం జరుగుతూనే ఉంటుంది. " జయం " అన్నది ఆ ఆత్మకు పునరుత్సాహాన్ని అందిస్తే .. " అపజయం" అన్నది ఆ ఆత్మలో విశేష సహనాన్ని పెంచుతుంది ! అందుకే ఆత్మ పురోగతికి " జయాపజయాలు " రెండూ కూడా సరిసమానమైన నిష్పత్తిలో అవసరం అయిన కీలక అంశాలు !
**అసలు ప్రయత్నమే లేనప్పుడు ..** జయం ఉండదు .. అపజయం ఉండదు .. మరి **" పురోగమనం "** అంతకన్నా ఉండదు. ఎన్ని జన్మలు ఎత్తినా ఆత్మ స్థితి అన్నది **ఎక్కడవేసిన గొంగళి** అక్కడే చందంగా వుంటుంది.

**ప్రశ్న : " ఎరుక " అన్నది ఎలా పెంచుకోవాలి ?**

**పత్రీజీ :** ఏదైనా సరే .. ఒకానొక విషయం పట్ల .. పూర్తి చైతన్య స్థితిని కలిగి ఉండడమే **" ఎరుక "** ! మన భౌతిక శరీరం యొక్క అవసరాల పట్ల మన చుట్టూ ఉన్న ప్రకృతిలోని అన్ని కోణాల పట్ల .. మరి ఈ విశాల విశ్వంలోని సమస్త లోకాల పట్ల .. చైతన్యపూరిత అవగాహనను ఏకకాలంలో కలిగి ఉంటూ ఆ ప్రకారంగా మెలుగుతూ ఉండడమే " ఎరుక " !

**ప్రశ్న : చాలా మంది తమ తమ జీవితాలను హాయిగా ఆనందించలేక పోతున్నారేమో అనిపిస్తోంది ?!**

**పత్రీజీ :** అది మీ అవగాహనలో లోపమే ! ఎందుకంటే .. మీ చుట్టూ ఉన్న ప్రతి ఒక్కరూ తమ తమ జీవితాలను హాయిగానే ఆనందిస్తున్నారు .. ప్రతి క్షణం క్రొత్త క్రొత్త పాఠాలను నేర్చుకుంటూనే ఉన్నారు.
ఇలా **" నిరంతర నేర్చుకోవడం "** అన్నది వారి వారి ఆత్మ యొక్క

ఎదుగుదలను బట్టి " **ఎరుకతో** " జరుగవచ్చు లేదా " **ఎరుకలేకుండా** " కూడా జరుగవచ్చు ! కానీ ఆ నేర్చుకున్న ఫలితం మాత్రం వారి భవిష్యత్ జీవితంపై తన ప్రభావాన్ని తప్పకుండా చూపిస్తుంది.

**ప్రశ్న :** **" తృప్తి " అన్నది ఎలా కలుగుతుంది ? !**

**పత్రీజీ :** జీవితంలో ఏ రంగం కూడా ఎవ్వరికీ సంపూర్ణమైన సంతృప్తిని ఇవ్వజాలదు! అయితే, ధ్యాన, స్వాధ్యాయ, సజ్జన సాంగత్యాదులతో కలిగే దివ్యజ్ఞానప్రకాశాన్ని పొందిన తరువాతే ఎవ్వరికైనా .. వారి వారి జీవితంలోని ఏ కార్యక్షేత్రమైనా కూడా .. తనదైన సంతృప్తిని కొద్దిగానైనా అందించగలుగుతుంది.

**ప్రశ్న :** **2012 తరువాత పరిస్థితి ?!**

**పత్రీజీ :** 2012 సంవత్సరం తరువాత నుంచి ప్రపంచంలో సకారాత్మక ఆలోచనలు చేసేవారి సంఖ్య విశేషంగా పెరుగుతోంది. 2016 కల్లా వారంతా ఆధ్యాత్మిక దృక్పథంతో పరిపుష్టం అయ్యి ..2020కల్లా ప్రపంచం లోని అన్ని కార్యక్షేత్రాలు కూడా ఆధ్యాత్మిక విజ్ఞాన శాస్త్రవేత్తలతో నిండిపోతాయి. ఇదంతా కూడా ఇంటర్ గెలాక్టిక్ ఫెడరేషన్ వారి సౌజన్యంతో జరుగుతూ వుంది!

**ప్రశ్న :** **బుద్ధుడు జాతకరీత్యా యోగీశ్వరుడు అయ్యాడా ? లేక సాధన ద్వారా అయ్యాడా ?**

**పత్రీజీ :** గౌతమ బుద్ధుడు గత అనేక జన్మలుగా యోగీశ్వరుడే! ఆయన సంగతి అలా ఉంచి .. " గౌతమ బుద్ధుడిలా నేను యోగీశ్వరుడిని నేను ఎలా కావాలి ?", " అందుకు నేను ఎంత సాధన చెయ్యాలి ? " అన్నదే ఇప్పుడు మీరు తలపెట్టాల్సిన విషయం !

**ప్రశ్న :** **" జ్ఞానం అన్నది ఎన్ని రకాలు ? "**

**పత్రీజీ :** " **జ్ఞానం** " అన్నది మౌలికంగా రెండు రకాలు :
ఒకటి .. " **ఆత్మపరమైన ఇంగిత జ్ఞానం** "
రెండు .. " **భౌతికపరమైన ఇంగిత జ్ఞానం** "
మనకు ఆత్మపరంగా అవసరం అయ్యేది ఏమిటో .. అవసరం కానిది ఏమిటో .. తెలుసుకోవడం అన్నదే " **ఆత్మపరమైన ఇంగిత జ్ఞానం** ".
మన భౌతిక అవసరాలతో పాటు .. ఇతరుల భౌతిక అవసరాలను కూడా అవసరం అయ్యింది ఏమిటో .. అవసరం కానిది ఏమిటో .. తెలుసుకోవడం అన్నది
" భౌతికపరమైన ఇంగిత జ్ఞానం."

**ప్రశ్న :** **" ధర్మబద్ధంగా ఎలా జీవించాలి ? "**

**పత్రీజీ :** మనిషై పుట్టిన ప్రతి ఒక్కరూ మౌలికంగా **మూడు ధర్మాలను** తప్పక పాటించాలి ..

**మొదటిది .. " దేహం పట్ల ధర్మం " :** ఈ భూమి మీద అనేకానేక అనుభవాల ద్వారా అనంతమైన జ్ఞానాన్ని పొందడానికి జన్మతీసుకున్న ఆత్మస్వరూపులమైన మనందరికీ .. దేహం ఒక **'వాహనం '** !

ఈ వాహనాన్ని మనం ఎప్పటికప్పుడు శ్రుతిబద్ధంగా, లయబద్ధంగా చూసుకుంటేనే అది మనకు సరి అయిన విధంగా సహకరిస్తూ వుంటుంది. వాహనం బాగుంటేనే కదా మనం ఎక్కడికైనా ప్రయాణం చెయ్యగలం .. మరి మనం వచ్చిన పనిని చక్కబెట్టుకోగలం ! కనుక **శుద్ధ శాకాహారంతో** శరీరానికి సరిఅయిన పోషణను అందిస్తూ, **ధ్యానంతో** దానిని శక్తివంతం చేయాలి.

మన శరీరంలో కోటానుకోట్ల కణాలు వున్నాయి. వాటన్నింటికీ మన గురించి బాగా తెలుసు కానీ .. మనకే వాటి గురించి ఏ మాత్రం తెలియదు. అందుకే సరికాని మాంసాహారంతో వాటిని బాధిస్తూ వాటిని వేదనకు గురిచేస్తున్నాం. పెట్రోలు కారులో డీజెల్ పోసి నడిపి దాని ఇంజన్ పనితీరును దెబ్బతీసినట్లు .. మాంసాహారంతో మన దేహం యొక్క పనితీరును దెబ్బతీస్తూ మనం అభాసు పాలు అవుతున్నాం!

ఈ కోటానుకోట్ల కణాల్లో ప్రతి ఒక్క కణం కూడా ఎంతో జ్ఞానవంతమైంది! మన కణజాలం అంతా కూడా ప్రతిక్షణం ఒకదానిని ఒకటి సమన్వయ పరచుకుంటూ క్రమక్రమంగా ఆత్మ ఉద్దీపన దిశగా సాగుతూంటుంది. కనుక వాటితో మనం సరియైన విధంగా ప్రవర్తించాలి అంటే .. మనకు **నిరంతర ధ్యానసాధన** మరి **అహింసా ధర్మాచరణయే** మార్గం !

**రెండవది " సమాజం పట్ల ధర్మం " :** సమాజంలో మనం కూడా భాగస్వాములం కనుక అందరూ సుఖంగా సంతోషంగా వుంటేనే మనం కూడా సంతోషంగా ఉంటాం ! అందుకు గాను మన దగ్గర ఉన్న ఆర్థిక సంపదనూ ఆధ్యాత్మిక సంపదనూ అందరితో పంచుకోవాలి. అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం వంటి అనేకానేక దానాలతో పాటు ధ్యానదానం కూడా చేయాలి.

ధ్యానప్రచారం ద్వారా ధ్యానదానం చేయకపోతే .. మిగతా అన్ని దానాలు కూడా వ్యర్థమైపోతాయి.

**మూడవది " ఆత్మ పట్ల ధర్మం " :** మనం ఏ పని కోసం ఈ భూమ్మీద జన్మ తీసుకున్నామో .. విశేషంగా ఆ పని మీదే ధ్యాస ఉంచుకుంటూ .. మరి ఇతర దైనందిన కార్యక్రమాలను నిర్వహించుకుంటూ వుండాలి. వచ్చిన

పనిని సజావుగా పూర్తిచేసుకోకపోతే .. ఇక్కడ గడిపిన మన జన్మకాలం తో పాటు మనం సంపాదించిన సంపదలన్నీ వ్యర్థమైపోతాయి ! ఆ తరువాత చనిపోయి పై లోకాల్లోకి వెళ్ళాక .. జరిగిన అనర్థానికి చింతించినా లాభం వుండదు .. మళ్ళీ జన్మ తీసుకోడానికి వేచి ఉండాల్సి ఉంటుంది. కనుక సమయాన్ని అనవసరమైన కాలక్షేపాలతో అతిగా వ్యర్థం చేసుకోకుండా .. ఇతోధికంగా ధ్యాన సాధనలో ఆత్మను పరిపుష్టం చెయ్యాలి! విశేషంగా స్వాధ్యాయ సాధన చేస్తూండాలి.. విస్తృతంగా సజ్జన సాంగత్యం చేయాలి !

**ప్రశ్న :** **" మరణానంతరం మన పరిస్థితి ఏంటి ? "**

**పత్రీజీ :** " మరణం " అంటే .. భౌతిక శరీరానికీ మరి సూక్ష్మశరీరానికీ మధ్య వున్న " **వెండిత్రాగు** – Silver Cord " యొక్క సంబంధం తెగిపోవడం మాత్రమే. మరణం ద్వారా " చైతన్యంతో కూడిన ఎరుక " మన భౌతికశరీరం నుంచి విడివడి .. " **సూక్ష్మశరీరం**" తో శాశ్వతంగా అనుసంధానించబడి .. ఇక అక్కడి నుంచే తన యొక్క కార్యకలాపాలు సాగిస్తూ వుంటుంది.

ఒకానొక సగటు మామూలు వ్యక్తి యొక్క సూక్ష్మశరీరం ..మరణం తర్వాత కూడా .. ఈ భూమి మీద కనీసం మూడురోజుల పాటు తిరుగుతూ వుంటుంది. ఆ సమయంలో " **ఒకానొక ఆస్ట్రల్ మాస్టర్** " మరి "**ఒకానొక ఆస్ట్రల్ అప్రెంటిస్** " కలిసి ఆ వ్యక్తికి సూచనలిస్తూ శక్తినిస్తూ ఊర్ధ్వలోకాలకు తీసుకువెళ్తారు. అక్కడ కాస్త సేద తీయించిన తర్వాత అతనితో అంతవరకూ ఆ జన్మలో అతడు గడిపిన జీవితాన్ని సింహావలోకనం చేయిస్తారు.

అప్పుడే అతని పాప మరి పుణ్యకార్యాల చిట్టా సరిచూడబడి, అతని కర్మలస్థాయిని అనుసరించి మళ్ళీ పునఃపరిశీలించబడిన లక్ష్యాలతో .. మరి పునర్ వ్యవస్థీకరించబడిన గమ్యాలతో .. అతని " **పునర్జన్మ ప్రణాళిక**" రచించబడుతుంది.

**ప్రశ్న :** **" దివ్యజ్ఞాన ప్రకాశం పొందడానికి ప్రత్యేక పద్ధతులు ఏవైనా ఉన్నాయా?"**

**పత్రీజీ :** **" దివ్యజ్ఞాన ప్రకాశం "** అన్నది అలనాటి గౌతమ బుద్ధుడికి మాదిరిగానే .. నేర్చుకునే క్షమతను బట్టి .. నేర్చుకోగలిగిన పరిస్థితులను బట్టి .. ప్రతి ఒక్కరిలో ఎంతో కొంత శాతం ఉంటూనే ఉంటుంది. మరి నిరంతర ధ్యాన – జ్ఞాన సాధనల ద్వారా తమ బుద్ధిని మరింత పదును పెట్టుకునే వాళ్ళంతా కూడా బుద్ధుళ్ళే!

బుద్ధుళ్ళుగా వున్నవాళ్ళు సమాజంలో ఉన్న ప్రతి ఒక్కరినీ కలుసుకుంటూ " ఎలా ఉండాలి ? " .. " ఎలా ఉండకూడదు ? " .. " ఎలా

మాట్లాడాలి ? " .. " ఎలా మాట్లాడకూడదు ? " .. " ఏం తినాలి ? " .. " ఏం తినకూడదు ? " లాంటి అనేకానేక విషయాల పట్ల సంబంధించిన మేలైన **బుద్ధి నీ, మౌలిక ఇంగిత జ్ఞానాన్నీ** ప్రతిక్షణం ధారాపాతంగా పొందుతూనే ఉంటారు !

ప్రశ్న : **" ' చదువు ' అన్నది వ్యాపారంలా మారిపోతూన్న ఈ తరుణంలో .. అసలు ఎలాంటి చదువు చదువుకోవాలో అర్థం కావడం లేదు ! "**

పత్రీజీ : **" చదువు "** అన్నది ప్రతి ఒక్కరిలో విజ్ఞానాన్నీ, విజ్ఞతనూ మరి విచక్షణా జ్ఞానాన్నీ పెంచి అసలైన జీవితశాస్త్రాన్ని బోధిస్తుంది. అందుకే ఈ లక్షణాలను కలిగి ఉన్న వాళ్ళను **"అసలైన చదువున్న, చదువుకున్నవాళ్ళు"** అంటారు !

రామకృష్ణ పరమహంస, రమణమహర్షి, జీసస్‌క్రైస్ట్, షిరిడీ సాయిబాబా, మహమ్మద్ ప్రవక్త వంటి ఎంతో మంది యోగులు ప్రాపంచిక చదువులేమీ చదువలేదు కానీ .. వాటిని చదివేసి లెక్కలేనన్ని డిగ్రీలను పేర్ల చివరన తగిలించుకున్న వాళ్ళెందరో వీళ్ళ దగ్గరికి అసలైన జీవితశాస్త్రాన్ని నేర్చుకోవడానికి వచ్చారు !

ప్రశ్న : **" మిమ్మల్ని కలిసిన ప్రతి ఒక్కరికీ మీరు ఎంతో ఆత్మీయులుగా కనిపిస్తారు .. ఎందుకు ? !! "**

పత్రీజీ : ఎందుకుంటే నేను అందరికీ ఒక **" అద్దం "** లా ఉంటాను కనుక !

**" అద్దం "** అన్నది ఎప్పుడూ తన ముందు ఉన్న వాళ్ళ నిజరూపాలనే ప్రతిబింబిస్తుంది! మరి ప్రతి ఒక్కరికీ **" అద్దం "** లో తమను తాము చూసుకోవడం ఎంతో నచ్చుతుంది కదా !

నేను కూడా **" అద్దం "** లాగే నా దగ్గరికి వచ్చిన వారి గుణగణాలను అచ్చంగా ప్రతిబింబిస్తూ ఉంటాను కనుక నా దగ్గరికి వచ్చిన వాళ్ళంతా కూడా తమను తాము ప్రేమించుకున్నట్లే .. తమకు **" అద్దం "** లా ఉన్న నన్ను కూడా అంతగానే ప్రేమిస్తూంటారు.

ప్రశ్న : **" ' దేవుడు ' ఎక్కడ ఉంటాడు ? "**

పత్రీజీ : **" సర్వం ఖల్విదం బ్రహ్మ "** .. అంటే **" ఈ వున్నదంతా దైవమే " ..** అందుకే నేను నా కంటికి కనిపించే జీవదేవుళ్ళందరినీ కొలుస్తూంటాను ; మరి ప్రతి ఒక్క దేవుడితో మాట్లాడుతూంటాను ; అందరితో కలిసి మెలిసి వుండటానికి ఉవ్విళ్ళూరుతూ వుంటాను !

ప్రశ్న : **" ' ఆధ్యాత్మికత ' అంటే ? "**

పత్రీజీ : " మనం పూర్ణ దేవుళ్ళనుంచి విడివడిన అంశ దేవుళ్ళం .. మనం దేవుళ్ళచే తయారు చేయబడిన దేవుళ్ళం " అని అర్థం చేసుకోవడమే **ఆధ్యాత్మికత.**

ఈ సత్యాన్ని తెలుసుకోవడానికి గాను మన దైనందిన జీవితంలో మనం చేయాల్సిన అతి ముఖ్యమైన పని **ధ్యానాభ్యాసం! నీటిలో మునిగితే-స్నానం .. శ్వాసలో మునిగితే - ధ్యానం .. సత్యంలో మునిగితే -జ్ఞానం!**

ప్రశ్న : **" మనలో శక్తి ఎన్ని రకాలుగా ప్రకటితం అవుతుంది ? "**

పత్రీజీ : **" తామసిక ", " రాజసిక ", " సాత్విక " .. " నిర్గుణ " ..**
తామసిక శక్తి భౌతిక శరీరంతో .. రాజసిక శక్తి మనస్సుతో .. సాత్విక శక్తి బుద్ధితో .. మరి నిర్గుణ శక్తి ఆత్మతో కలిసి ప్రకటితం అవుతూ వుంటుంది.

ప్రశ్న : **" ' జ్ఞానం ' ఎలా సేకరించుకోవాలి ? "**

పత్రీజీ : ప్రతి పువ్వులోనూ అంతో ఇంతో మకరందం ఉన్నట్లే.. ప్రతి మనిషిలో కూడా స్వల్పంగానో, అధికంగానో **ఇంగితజ్ఞానం** అన్నది విధిగా ఉంటూనే ఉంటుంది. కాబట్టి ఒకానొక తుమ్మెద ప్రతి పువ్వు నుంచీ మకరందాన్ని గ్రోలినట్లు ఒకానొక ముముక్షువు ఏ ఒక్కరినీ విస్మరించకుండా ప్రతి ఒక్కరి నుంచీ ఇంగిత జ్ఞానాన్ని విధిగా సేకరించుకోవాలి. అలా సేకరించుకున్న జ్ఞానాన్ని ఆచరణ ద్వారా తన **అనుభవ జ్ఞానం**లా మలచుకుంటూ .. దానిని మళ్ళీ పది మందితో పంచుకోవాలి ; సర్వకాల సర్వావస్థల్లోనూ **" జ్ఞాన సేకరణ " సూత్రం** ఇదే.

**బొట్టూ బొట్టూ చేరి సముద్రం అవుతుంది కదా !**

ప్రశ్న : **" ' సన్యాసం ' అంటే ఏమిటి ? అది ఎన్ని రకాలు ? "**

పత్రీజీ : **" సమ్యక్ "** .. అంటే **" సరియైన "**
**" న్యాసం "** .. అంటే **" త్యజించడం "**
**సమ్యక్ + న్యాసం = సన్యాసం**
**" సన్యాసం "** అంటే **" సరియైన వాటిని త్యజించడం"**
సన్యాసం అన్నది నాలుగు రకాలు :

1. **మర్కట సన్యాసం :** చిన్ని చిన్ని కారణాలకే సన్యాసులుగా మారి ఉన్న సంసారాన్ని వదిలి పెట్టేయడం .. మర్కట సన్యాసం. ఇది " శూద్రసన్యాసం " .. మరి ఇలాంటివారు కొన్నిరోజులకు మరొక సంసారంలో తగులుకుంటూ ఉంటారు.
2. **ఆపత్ సన్యాసం :** ఇప్పుడో .. మరి కాస్సేపట్లోనో .. చనిపోతానని తెలిసి " **స్వర్గంలో స్థానం పొందాలి** " అన్న ఆశతో సన్యాసాన్ని స్వీకరించడం ఆపత్‌సన్యాసం; ఇది **" వైశ్య సన్యాసం ".**
3. **వివిధిష సన్యాసం :** సత్యాన్ని తెలుసుకోవాలన్న తీవ్ర ఆకాంక్ష మరి జ్ఞాన తృష్ణతో తమకు ఉన్న ప్రతి దానినీ త్యజించి తీసుకునే సన్యాసం **వివిధిష**

సన్యాసం. మేథో తత్వానికి చెందిన **వివేకానందుని** లాంటివారు ఇందుకు ఉదాహరణ; ఇది **"క్షత్రియ సన్యాసం"**.

**4. విద్యుత్ సన్యాసం :** సన్యాసాల్లో కెల్లా అత్యున్నత ఆత్మస్థాయికి చెందిన సన్యాసమే **విద్యుత్ సన్యాసం!** బ్రహ్మజ్ఞానులైన విద్వత్ సన్యాసులు .. తమ సంసారాన్ని కాకుండా సంసారం పట్ల తమకు ఉన్న అజ్ఞానాన్ని మాత్రం వదలిపెడతారు. వారు తమ దైనందిన జీవితంలో అనవసరమైన వాటిని వదిలిపెట్టి అవసరమైన వాటికే పరిమితం అవుతూ **"సంసారంలోనే నిర్వాణం"** చెందుతూ వుంటారు; ఇది **బ్రాహ్మణ సన్యాసం;** ఇది **పిరమిడ్ మాస్టర్లకు స్వంతం!**

**ప్రశ్న :** **" ' శాస్త్రం ' అంటే ఏమిటి ? "**

**పత్రీజీ :** ఏ పని చేస్తే, ఏ ఫలితం వస్తుందో .. ఏ కారణం  ఏ పరిణామంగా మారుతుందో .. విశద పరిచేదే **" శాస్త్రం " !**

**ప్రశ్న :** **" జీవితం ఒక ఉత్సవం ఎప్పుడు అవుతుంది ?**

**పత్రీజీ :** ధ్యాన–జ్ఞానాదుల వలన మనకు సృష్టియొక్క మూల సిద్ధాంతాలన్నీ అవగతం అయినప్పుడు మనకూ మరి విశ్వంలో ఉన్న అనేకానేక నక్షత్ర లోకవాసులకూ మధ్య వున్న సంబంధాన్ని తెలుసుకోగలిగే " ఆత్మజ్ఞాన ప్రకాశం " మన స్వంతం అవుతుంది. " ఆత్మజ్ఞాన ప్రకాశాన్ని " పొందిన మనం యుక్తా యుక్త విచక్షణతో కూడి ఉంటూ మన జీవితాన్ని ప్రతిక్షణం ఒక ఉత్సవంలా జీవిస్తూంటాం !

**ప్రశ్న :** **పాపాలు చేసేవాళ్ళంతా మళ్ళీ జన్మల్లో క్రిమికీట కాదులుగా పుడతారని పురాణాల్లో వ్రాసింది నిజమేనా?**

**పత్రీజీ :** అవన్నీ కూడా ఆధ్యాత్మికపరంగా కొందరు వ్రాసిన **పనికి వచ్చే చిలిపి వ్రాతలు!** మానవజన్మ తరువాత మానవజన్మలే పరంపరగా వుంటాయి! ఒక మానవజన్మలో నేర్చుకోని పాఠాలు మరు మానవజన్మల్లో సరిచేసుకునే తీరాలి !

**ప్రశ్న :** **" సమాజం పట్ల మన కర్తవ్యం ? "**

**పత్రీజీ :** సమాజంలో ఇతరులు అందరూ సుఖంగా, సంతోషంగా మరి ఆరోగ్యంగా ఉంటేనే మనం ఆనందంగా ఉంటాం ! అందుకు గాను మన దగ్గర ఉన్న సర్వ వనరులను మనకు అవసరమైనంత మేర మాత్రమే ఖర్చుపెట్టుకుంటూ మిగిలిన వాటిని ఇతరులతో పంచుకోవాలి.

**అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం వంటి దానాలతోపాటు .. " ధ్యానదానం "** మరి **" జ్ఞానదానం "** వంటి దానాలను మరి శక్తిమేరకు చెయ్యాలి !

# తటవర్తి వీరరాఘవరావు గారి రచనలు

| | | |
|---|---|---|
| 1) జీవితశాస్త్రం (మొదటిభాగం) | - | రూ.100/- |
| 2) జీవితశాస్త్రం (రెండవభాగం) | - | రూ.100/- |
| 3) జీవిత సత్యాలు | - | రూ.100/- |
| 4) భగవంతుడంటే | - | రూ.100/- |
| 5) సత్యమార్గం | - | రూ.100/- |
| 6) ఆత్మ శాస్త్రం | - | రూ.100/- |
| 7) ధ్యాన శాస్త్రం | - | రూ.100/- |
| 8) జ్ఞానరసగుళికలు (పత్రీజీ) | - | రూ.100/- |
| 9) పరమగురువుల ప్రబోధాలు (పత్రీజీ) | - | రూ.100/- |
| 10) భగవద్గీతా సారం - శ్రీ కృష్ణ సందేశం | - | రూ.100/- |
| 11) ధ్యాన శక్తి | - | రూ.100/- |
| 12) తెలుసుకోండి | - | రూ.120/- |
| 13) జీవిత సూక్ష్మాలు | - | రూ.120/- |
| 14) గీతాసందేశం | - | రూ.100/- |
| 15) కర్మ సిద్ధాంతం | - | రూ.80/- |
| 16) బ్రహ్మాజ్ఞానం | - | రూ.60/- |
| 17) ఆత్మజ్ఞానం ఎందుకు? | - | రూ.70/- |
| 18) ధ్యానమంటే ? | - | రూ.50/- |
| 19) జ్ఞాన జ్యోతి | - | రూ.70/- |
| 20) జ్ఞాన కుసుమాలు | - | రూ.50/- |
| 21) దుఃఖ నివారణామార్గం | - | రూ.60/- |
| 22) త్రివిధాలు | - | రూ.60/- |
| 23) ధ్యానం (పత్రీజీ) | - | రూ.50/- |
| 24) ధ్యానం వల్లనే జ్ఞానం | - | రూ.60/- |
| 25) అతీంద్రియ శక్తులు | - | రూ.50/- |
| 26) శాస్త్రాల అర్థం- అంతరార్థం | - | రూ.60/- |
| 27) ఆశ్చర్యం... ఆశ్చర్యం | - | రూ.50/- |
| 28) విద్యార్థుల వికాసానికి ధ్యాన విద్య | - | రూ.50/- |
| 29) మౌన ధ్యానం | - | రూ.40/- |
| 30) ఈ జీవితం ఎందుకు? | - | రూ.50/- |
| 31) నిర్వాణ మార్గం | - | రూ.50/- |
| 32) షిరిడీసాయి సందేశాలు | - | రూ.40/- |
| 33) భాగవత సన్నివేశాల అంతరార్థం | - | రూ.40/- |
| 34) భూతదయే దైవత్వం | - | రూ.40/- |
| 35) ఆలోచించండి | - | రూ.40/- |
| 36) సంకల్పమంటే? | - | రూ.50/- |
| 37) మరోజన్మ (తటవర్తి రాజ్యలక్ష్మి) | - | రూ.30/- |
| 38) మనం ఇహలోకవాసులమా? పరలోకవాసులమా? | - | రూ.20/- |
| 39) శాకాహారమే మానవాహారం | - | రూ.15/- |
| 40) అహింస మరియు శాఖాహారం | - | రూ.15/- |

పుస్తకముల కొరకు :

**తటవర్తి వీర రాఘవరావు,**

తటవర్తి వారి వీధి, భీమవరం-534 201. (ప॥గో॥జిల్లా.)
ఫోన్ : 9490171853, సెల్ : 9440309812



# "ముక్తి"

"ముక్తి" అంటే విడుదల,
దేని నుంచి విడుదల?
తాపత్రయం నుంచి.
"త్రివిధ దు:ఖాలే తాపత్రయాలు" అవి

(1) ఆధ్యాత్మిక తాపం :- కామ, క్రోధ, మోహ, మద, మాత్సర్యాలనబడే అరిషడ్వార్గల వల్ల కలిగే బాధలు.

(2) ఆదిభౌతిక తాపం :- మన ప్రమేయం లేకుండా ఇతరుల అజ్ఞాన, అక్రమ చర్యల వల్ల కలిగే బాధలు.

(3) ఆదిదైవిక తాపం :- అతి వృష్టి, అనావృష్టి, భూకంపాలు మొదలైన ప్రకృతి వైపరీత్యాల వల్ల కలిగే బాధలు.

ఈ మూడు రకాల దు:ఖాల నుంచి పూర్తిగా బయట పడటమే "మోక్షం", "ముక్తి" అంటారు.

అటువంటి "ముక్తి" "ఆత్మజ్ఞానం" వల్లనే సంప్రాప్తిస్తుంది.

- బ్రహ్మర్షి పత్రీజీ

రూ.70/-